# Seeta





# Kalyanam



BY

V. RAMASUBBARAYUDU, *B. A.,*

&

VENKATANARAYANA

*Sodara Kavulu*

# Seeta





# Kalyanam



BY

V. RAMASUBBARAYUDU, *B. A.*,

&

VENKATANARAYANA

*Sodara Kavulu*

స్నేహలతాకవితాసంఘపుష్పము. 50.

శ్రీమత్పరదేవతాయై నమః

# సీతాకల్యాణము





గ్రంథకర్తలు

వాజపేయయాజుల రామసుబ్బారాయ

వేంకటనారాయణ సోదరకవులు

స్నేహలతాకవితాసంఘాధ్యక్షులు

కొల్లాపురము.

( జటప్రోలుసంస్థానము)



SREE SREE

**SURABHI VENKATA JAGANNADHARAO BAHADUR VARU**

*Kumara Rajah of Jatprole.*

# పీఠిక



వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ.

కావ్యస్వరూపనిరూపణమునఁ బ్రాచీనులయినయాలంకారికులు పలువురు పలుతెఱఁగులయభిప్రాయములు తెలిపియున్నారు. 'అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్యమ్' 'దోసంగులు పొసంగక యెసంగెడుగుణమ్ముల నలంకారమ్ముల విలసిల్లుశబ్దార్థములు కావ్య' మని విద్యానాథపండితులును, "రమణీయార్థప్రతిపాదక శ్శబ్దః కావ్యమ్". 'రమణీయమైన యర్థమును దెలియఁజేయుశబ్దము కావ్య' మని జగన్నాథపండితులును, "కావ్యం రసాత్మకం వాక్యమ్". 'రసమే యాత్మ (జీవనాధాయకము) గాఁగలవాక్యము కావ్య'మని విశ్వనాథపండితులును, "విశ్వశ్రేయః కావ్యమ్; తదదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ; సా వాగ్యా రసవృత్తిః; సాధ్యోహి రసో యథాతథం కవిభిః" అని నన్నపార్యులును వచించిరి.

స్థూలదృష్టికి విభిన్నములుగాఁ గానవచ్చినను పైనుడివినవిచక్షణులనిర్వచనము లన్నియు 'రసపారమ్యము నందియనన్యలభ్యమయి యనిర్వచనీయ మయినయానంద మొదవించువాగర్థములు కావ్య' మని నిరూపించుచున్నట్లు సూక్ష్మదృష్టికి గోచరింపకపోదు. "సర్వేషాం వేదానాం శాస్త్రాణాం బ్రహ్మణి తాత్పర్య" మని యాచార్యులు వచించినట్లు శబ్దము అర్థము, గుణములు, అలంకారములు, వృత్తులు, రీతులు, శయ్యా, పాకము మున్నగుపరికరము లన్నియు రసమునందుఁ దాత్పర్యము నంది సహృదయులహృదయములందు లోకోత్తరమైన యానంద ముదయింపఁజేయుచున్నవి. "రసోవై సః; రసగ్గ్హ్యే

వాయం లబ్ధ్వానందీభవతి" అను శ్రుత్యర్థమును స్వీకరించుచు న్నవి. ఈయర్థమునే యాచార్యదండి "కామం సర్వోప్యలంకారో రస మర్థే నిషించతి" యనువాక్యమున సూచించియు న్నాఁడు. దీనింబట్టి పదలాలిత్యమున, అర్థగౌరవమున, భావగాంభీర్యమున, అలంకృతిచమత్కృతిని రసానుభవసామ్రాజ్యము నందఁజేయునదే కావ్య మనఁదగినదని తేలినది. ఇట్టిదికాకున్న నది కావ్య మనఁదగదని తొల్లింటివారే వచించిరి.

"కిం కవే స్తేన కావ్యేన కిం కాండేన ధనుష్మతః
పరస్య హృదయే లగ్నం నఘూర్ణయతి య చ్ఛిరః."

'పరునిహృదయమున నాటి వానితల నుఱ్ఱూఁతలూచని కవి కావ్యము కావ్యమా? యోధునిబాణము బాణమా?'

ఇట్లు నిరతిశయానందసంధాయకత్వమే కాక "సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే" యని మమ్మటార్యుఁడును "కాంతాసమ్మితయా యయా సరసతామాపాద్య కావ్యశ్రియా కర్తవ్యే కుతుకీ బుధో విరచిత స్తస్యై స్పృహాం కుర్మహే" అని విద్యానాథులును వచించినవిధమున జాణ యగుచానవలె వా విచ్చి నుడువకయే వ్యంగ్య వైభవమున హితాహితములను బోధించి జనులను గర్తవ్య సుముఖులను, అకర్తవ్యవిముఖులను గావించుటయుఁ గావ్యము యొక్క ప్రయోజనము. ఆదికావ్య మగు రామాయణము నైతము వేదశాస్త్రపురాణాదులవలె నొక్క యంశమునైనఁ గంఠోక్తముగఁ దెలుపకయె శ్రీరామచంద్రునివలెఁ బితృవాక్యనిరతులై, భరతునివలె భ్రాతృభక్తిభరితులై, లక్ష్మణునివలె స్వాభ్రాత్రశోభితులై, సీతవలెఁ బత్యేకతానజీవనలై, ఆంజనేయునివలె స్వామికార్యతత్పరులై వర్తింపవల

యును; ఖరాదులవలె నుద్ధతులును, రావణాదులవలెఁ గుపథ ప్రవృత్తులును, గారాదను మున్నగుభావములను జదువరుల యుల్లంబుల వెదచల్లుచున్నదికదా. అంతదూరము పోనేల ? మనయాంధ్రవాఙ్మయమునఁ బ్రథమప్రబంధముగా నెన్నఁబడు మనుచరిత్రమును జదువునపుడు ప్రవరునివలె ధీరచిత్తులమును స్వరోచివలె నార్తరక్షణతత్పరులమునై వర్తింపవలయును; ఇందీవరాఖ్యునివలె నుద్ధతులము మనోరమాదులవలె సాధు బాధాకరులమును గారాదనుమొదలగుభావము లెన్నియో చదువరులచిత్తముల హత్తకుండునా? రసోల్లసితము లయ్యును సదుపదేశవిరహితము లయినకావ్యముల నసత్కావ్యములుగా నెంచి యట్టివానినిఁ జదువరాదని "కావ్యాలాపాంశ్చ వర్జయే" త్తని శాసించిరి.

ఉత్తమభావముల నలవడఁజేయుట కుత్తమచరిత్రము లనే వర్ణింపవలయును. అందువల్లనే తొల్లింటి కవితల్లజు లెల్లరు నుత్తమాదర్శములను గయికొనియే ప్రబంధము లల్లఁ జొచ్చిరి. ఈయర్థమునే "పుణ్యశ్లోకస్య చరిత ముదాహరణ మర్హతి" అని ప్రతాపరుద్రీయము నుడువుచున్నది. అట్టి పుణ్యశ్లోకుఁడు శ్రీరామచంద్రుఁడేయని మురారికవి యనర్ఘ రాఘవమున "యది క్షుణ్ణం పూర్వై రితి జహాతి రామస్య చరితం గుణై రేతావద్భి ర్జయతి పున రన్యో జగతి కః" అని ఘంటాఘోషముగఁ జాటియున్నాఁడు. ఆలోకోత్తరచరిత్రునిఁ గథానాయకునిగాఁ జేకొని కవిసోదరులును స్నేహ లతాకవితాసంఘాధ్యక్షులు నగుశ్రీవాజపేయయాజుల రామ సుబ్బరాయ వేంకటనారాయణసోదరకవు లీసీతాకల్యాణమను కావ్యరత్నమును రచియించిరి.

క. "మృదుశైలి స్వభావోక్తియుఁ
బదలాలిత్యమును ధీరపామరజనతా
హృదయంగమరచనయు నీ
సుదృఙ్మణులవాక్యఫణితి శోభిలు మిగులన్."

అని యొకవిమర్శకశేఖరుఁడు నొడివినవడువున మనయీసోదరకవులరచన లలితపదయుతమును, అర్థగరిమసముపేతమును, స్వభావోక్తివిలసితమునై ద్రాక్షాపాకము నంది సహృదయహృదయంగమమై యొప్పుమిగిలియున్నదని చెప్పనొప్పును. కల్పనాకౌశలమున మనసోదరకవులను మించినవారు కొందఱుండవచ్చునేమోకాని యాధునికులలో నింతసరళముగ నిట్టియనర్గళధారతో నిట్లుసర్వజనరంజకముగఁ గావ్యరచనఁ గావింపఁగలవా రెందఱో యుండరనుట యతిశయోక్తి కానేరదు. కొన్నియెడలఁ బద్యములనడక హృద్యతరమై యుండుటయకాక యొకవిధమయిన గానమును వెలిపుచ్చుచుండును. చిన్నిచిన్ని పదములతో ముద్దుగుపద్దెము లల్లి వీనులవిందుసేయునేర్పొందఱకో యుండదు. ఈకవికిశోరము లట్టి కౌశలము నీచిన్నిపొత్తమునం దెన్నియెడలనో ప్రదర్శించియున్నారు.

| | | |
|---|---|---|
| (1) పుట్టుము | — | ద్వితీయ 44. |
| (2) అంతిపురంబునన్ | — | ద్వితీయ 61. |
| (3) విషరాశి | — | ద్వితీయ 70. |

ఈప్రబంధమునందలి యితివృత్తము సుప్రసిద్ధమైనది. అందువలన విషయవిమర్శ మంతయావశ్యకము కాదు.

మూలకథయందు సోదరకవులు కావించినమార్పులును లే వనవచ్చును. ఇఁక నిందు వీరు పోయినక్రొత్తపోకడ లెవ్వి?

మూలము నెంతవఱకు ననుసరించిరి? ఎచ్చటఁ బెంచిరి? ఎచ్చట నన్యకవుల ననుకరించిరి? యనుమున్నగువిషయముల నించుక పరిశీలింతము. తొలుదొల్తనే యీమనసోదరకవు లార్యావర్తదేశమును బెక్కు పద్యములలో వర్ణించి తమదేశ భక్తిని వెల్లడించుటయేకాక మనదేశపుఁ బూర్వపుఔన్నత్య మును వెల్లడించి పాఠకులహృదయక్షేత్రముల దేశభక్తిబీజ ములను నాటియున్నారు. ఈక్రిందిపద్యములు మనదేశపుఁ బ్రాచీనోత్కర్షము నెట్లుచాటుచున్నవో చిత్తగింపుఁడు.

(1) మిక్కుటమైన — ప్రథమ 3.
(2) ఆడినమాట — ప్రథమ 8.
(3) దేహీయటంచు — ప్రథమ 11.

మనసోదరకవులు వాజపేయయాజులవంశమందే యవ తరించినవారగుట శ్రౌతవిధిజ్ఞులగుట దశరథునియశ్వమేధ విధానమును యథామూలముగ సంప్రదాయానుసారముగ సక్రమముగ సంతరించిరి. ఇది కొంతవఱకు ఛాందసముగఁ దోఁపవచ్చునేమోయని భయపడుచున్నాను.

ఈక్రిందిపద్యములు మూలశ్లోకముల నెట్లనుసరించు చున్నవో చూడుఁడు.

1. శ్లో. మిథిలాధిపతిం శూరం జనకం సత్యవిక్రమమ్
నిష్ఠితం సర్వశాస్త్రేషు తథా వేదేషు నిష్ఠితమ్
తమానయ మహాభాగం స్వయమేవ సుసత్కృతమ్
పూర్వసంబంధినం జ్ఞాత్వా తతఃపూర్వం బ్రవీమి తే.
ఉ. శాంతుని వేదవేది ... ... ద్వితీయ 11.
2. శ్లో. షష్టిర్వర్షసహస్రాణి జాతస్య మమ కౌశిక
దుఃఖే నోత్పాదిత శ్చాయం న రామం నేతు మర్హసి.

చతుర్ణా మాత్మజానాం హి ప్రీతిః పరమికా మమ
జ్యేష్ఠం ధర్మప్రధానంచ న రామం నేతు మర్హసి.

గీ. వరుస నఱువదివేలసంవత్సరములు ... ద్వితీయ 126

గీ. అల్ల రాముండు ... ద్వితీయ 127

3. శ్లో. బాలో హ్యకృతవిద్యశ్చ నచ వేత్తి బలాబలమ్
నచాస్త్రబలసంయుక్తో నచ యుద్ధవిశారదః
విప్రయుక్తోహి రామేణ ముహూర్తమపి నోత్సహే
జీవితం మునిశార్దూల న రామం నేతు మర్హసి.

ఉ. రాముఁడు చిన్నవాఁడు ... ... ద్వితీయ 128

4. శ్లో. అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్
వసిష్ఠోఽపి మహాతేజా యే చేమే తపసి స్థితాః.

గీ. రామభద్రునిసత్యపరాక్రమంబు ... ద్వితీయ 155

దశరథవిశ్వామిత్రసంభాషణము శ్రీమద్రామాయణమునం దంతయెక్కువగా లేకున్నను మనకవికిశోరు లాఘట్టమును బెంచి ప్రబంధధోరణిని దిద్దిరి. కొన్ని పద్యముల నావేశపరవశులై పాడిరని చెప్పినను దప్పుగాదు. పైసందర్భమున నఱువదిపద్యముల నీకవులు గూర్చిరి.

(ద్వితీయ 100 మొదలు ఆశ్వాసాంతమువఱకు.)

ఇందొండురెండుతావుల శ్రీనాథాదులయనుకరణములు గానవచ్చుచున్నవి.

సీ. కాంతిసంపద నేల కైవార మొనరింప
విధుబింబమున నుద్భవించి రనిన

(శ్రీనాథభీమఖండము)

ప్రాకార మమరేంద్రలోకాంత మన్నచో
హర్మ్యజాలోన్నతు లడుగనేల?

(అబ్బయామాత్యకవిజనమనోరంజనము.)

ఆది బ్రహ్మను గన్నయయ్యయేగద రాముఁ
డాతనిపై దుష్య మడుగనేల?

(ద్వితీయ 85)

ఇందుఁ బ్రధానరసము శృంగారమైనను నందందు సందర్భానుసారముగ వీరకరుణాదులునైతము పొందుపఱుపఁబడియున్నవి. సమయానుసారముగ మనకవియువకులు సాగసైనయలంకృతులచేఁ దమకవితాకన్యకకు వన్నియఁగూర్చియున్నారు. ఈక్రిందిపద్యములయందలి యలంకృతిచమత్కృతినిఁ జిత్తగింపుఁడు.

(ద్వితీయ 22, 23 పద్యములు.)

"ప్రతీయమానం పునరన్యదేవ వస్త్వస్తి వాణీషు మహాకవీనామ్
యత్తత్ప్రసిద్ధావయవాతిరిక్తం విభాతి లావణ్యమివాంగనాసు"

అని యానందవర్ధనుఁడు చెప్పినచొప్పున మహాకవుల రచనలయం దుత్తమాంగనశరీరమునందు ముఖాద్యవయవములకంటె వేఱయిన లావణ్యమువలె గుణాలంకారాద్యతిరిక్తమై యానందసంధాయక మగువిషయ మొండు పొడచూపుచుండును. అదియే కావ్యమునకు శోభ నొసంగునది. అట్టి దీకావ్యమున నెల్లెడల వెల్లివిరియుచున్నయది.

ఇట్టియీయుత్తమకృతిని జంద్రికాపరిణయప్రబంధరచయిత లగుమాధవరాయలాదిగాఁగల్గువిద్వద్రాజరత్నముల కాకరమై యశస్సురభిళ మైనసురభివంశమున నుద్భవమంది

సకలకల్యాణగుణములఁ గథానాయకున కెనవచ్చు శ్రీ శ్రీ సురభి వేంకటజగన్నాథరావు బహద్దరువారికి జటప్రోలుసంస్థాన యువరాజువారికి సమర్పించి మనసోదరకవులు కృతార్థతం గాంచిరి.

" మణినా వలయం వలయేన మణి
ర్మణినా వలయేన విభాతి కరః
కవినాచ విభు ర్విభునాచ కవిః
కవినా విభునాచ విభాతి సభా. "

యని యార్యులు వచించిన ట్లుత్తమగుణోపేతు లైనకృతిపతు లచేఁ గృతియును, ఉత్తమగుణోపేత యగుకృతిచేఁ గృతిపతులును, అట్టియుత్తమప్రభువులును, ఉత్తమకవులు నుండుటవలన శ్రీజటప్రోలు సంస్థానమును ఆచంద్రతారార్క మైనయుత్తమ కీర్తితో నెగడుచుండునట్లు సర్వశక్తియుతుఁ డగుసర్వేశ్వరుఁ డనుగ్రహించుఁగాత.

శ్రీ శ్రీ జటప్రోలుసంస్థానాధీశ్వరు లిట్టియుత్తమ కృతిరత్నము లనేకములు చేపట్టి విద్వత్కవులను నిరంతర మాదరింత్రుగాక ! మాసోదరకవు లిట్టిస్నేహలతాకుసుమమాలిక లనేకములఁ గూర్చి మాతృభాషామతల్లి నలంకరింతురుగాక !

అనంతపురము,
ధాతుచైత్రపూర్ణిమ.

ఇట్లు విద్వజ్జనవిధేయుఁడు,
ప్రయాగ వేంకటరామశాస్త్రి,
దత్తమండలికళాశాలాంధ్రపండితుఁడు.



# సీతాకల్యాణకృతిప్రశంస



ఇయ్యది మూఁడాశ్వాసముల ప్రబంధరాజము. లాక్షణికులమతము ననుసరించి యిట్టిరచనలయందు వస్తువుకన్న వర్ణనావైశద్యము, శబ్దాలంకారబాహుళ్యము, చిత్రము లగు పోకడలు నతిశయముగ నుండును. పూర్వప్రబంధములయందు మనుచరిత్రాద్యుత్తమగ్రంథములుతక్కఁ దక్కుంగలవానిలో విసుఁగు జనించునట్టియ్యవి చర్వితచర్వణముగఁ బొందింపఁబడియె. ఇందు వస్తుతత్వము విస్మరింపఁజేయు వర్ణనబాహుళ్యము ప్రయత్నపూర్వకముగ విడువఁబడుట గమనింపవలసిన ముఖ్యవిషయము-ప్రబంధరచనకుం దోడంగి యెట్టివర్ణనములు వీరు విడిచిరో యించుక తెలుపవలసియున్నది. కల్యాణ మను పేరుతో వ్రాసినప్రబంధములయందు శృంగారరసము ప్రధానముగాఁ గైకొని దానికి నంగము లగు కేళీవనవిహారాదివర్ణనములతోఁ బ్రారంభించి, యనురాగబీజమును మొలకెత్తించి నాయికానాయకుల విరహమున కంగములుగఁ జంద్రాద్యుపాలంభనంబు లొనర్చి తుదకు శయ్యాగృహమునకుంగూడఁ గొంపోయి యట వారిరహస్యవిలాసములఁ గూడఁ గని పాఠకులకు వ్యక్తముచేయుట కలదు. కాని యీసీతాకల్యాణమునందలిగాథ యాద్యంతము బాలకాండవృత్తాంతమేయైనను బ్రబంధమున కనుకూలించునట్లసభ్యశృంగారమునకుఁ దావీయక నైతికమును విడువక మహోన్నతముగ మార్చి కూర్పఁ

బడినది. ఈవిషయములను గ్రంథస్థసందర్భముల నుదాహరించూపిననే పాఠకులకు విశ్వాస ముదయించును. స్వయము గ్రంథమును బఠించి యాప్రత్యేకరచన కనుకూల మగుసన్నివేశము లందుఁ గాంచి యందలి యౌచితియు, సౌందర్యమున వెల్లడిసేయుసదుద్దేశముతోఁ జేతి కందినపాత్తము నాద్యంతము తిలకించి కృతికర్తలప్రయత్నవిధాన మించుక విశదీకరించుచున్నాఁడను.

భారతీయుని ప్రత్యేకవ్యక్తిత్వ మీగ్రంథాదిని మన కుద్ద్యోతకమగుచున్నది. కోసలరాజధానియై, యిక్ష్వాకువంశీయులకు ముఖ్యస్థాన మైనయయోధ్యాపురవర్ణనము సేయంబోవుచు నయ్యది తమమాతృభూమి యగుభరతఖండమున నొకపట్టణరాజమని కవులు పదునాలుపద్యములలో వర్ణించి మాతృదేశప్రిభావమును, బూర్వరాజగాథాకీర్తనమును గావించిరి. తదనంతరము పురవర్ణనమునకుం దొడంగి సుమారు ముప్పదిపద్యములలోఁ బ్రిబంధసరణిని విడువక యయోధ్య, యందలికోటలు, హర్మ్యరాజములు, ఉద్యానవనములు, చాతుర్వర్ణ్యము, జాత్యంతరములు, రథగజాదివాహనములు వర్ణనయోగ్యములై యొప్పారినను వైషయికములగు పుష్పలావికావిటీవిటసంవాదములు విడువంబడియె. ఈవిడుచుటయుఁ బ్రిబంధము నసభ్యశృంగారమునుండి దూరీకృతముసేయుటకొఱకే యని తోఁచుచున్నది. ఆవల నవనిపాలుం డగుదశరథుని ప్రిసంగము - సర్వమున్నను బుత్రిలులేనిచింతాభరం బీవృద్ధరాజు నాక్రిమించె. ఈసందర్భమును గైకొని మరలఁ బ్రబంధ

శైలి ననుగమించి పదునాలుగుపద్యములలో నాతనిచింతాభారము వెలువరింపఁబడినది.

ప్రత్యక్షముగ నిందు నాయికానాయకుల విరహము వర్ణింపఁబడలేదు. పూర్వపద్ధతి ననుసరించువారలేయైన వివాహమునకుఁ బూర్వమే దూతికలద్వారమున నాయికానాయకులకుఁ బరిచయమును గల్పించి విరహమును గూర్చునవకాశమును దెచ్చిపెట్టుకొనియే యుందురు. ముందునకు సాగిపోవ ఋషులతపశ్చర్యాదులు వారియాకారవైఖరులు వర్ణింపఁబడియె. ఇట్లే వసంతసమాగమంబున నాదిదివసంబున యజ్ఞము ప్రారంభమైనదని నుడువుచు వసంతవనలక్ష్మి సరసశృంగారవిలాసములు ముచ్చటగుమూడుపద్యములలో వర్ణింపఁబడియె. సాధారణముగా నియ్యది యవ్యక్తయౌవన యగునాయిక యంగాదివర్ణనములతో జోడింపఁబడి పూర్వప్రబంధముల నలరారుచుండు. ఇట నట్లుగాక వనలక్ష్మి తనకుఁదానై చేసికొన్న విధముగా వర్ణింపఁబడియె. ఇట్లే యశ్వమేధవర్ణనము నలుబది పద్యములలో వర్ణింపఁబడియె. తక్కుంగల వర్ణనములలో రాముని బాల్యవర్ణన మగ్రస్థాన మలంకరించుచున్నది.

తుదిమాటగ నవకాశమున్నను వెఱ్ఱిశృంగారముల పోంతఁబోక, యౌచితి చెడఁగొట్టకుండఁ గాపాడినవిషయ మింకొక్కటి గలదు. అదియేదన మిథిలానగరవీథుల విశ్వామిత్రునివెంటఁ బోవురామలక్ష్మణులను దిలకించుటకై ప్రజ గుమిగూడియే యుండును. ఆబాలగోపాల మామోహనా

కారులఁ గాంచియుండరా ? పూర్వప్రబంధములయందుంబలె యౌవనవతులహావభావవిలాసవికారముల వర్ణింప నీకవుల కవకాశముండియే యున్నది. కాని వా రద్దానిపొంతఁ బోలేదు. కాన నీవిధముగ గ్రంథస్థవర్ణనములను దిలకించినఁ బూర్వప్రబంధములకుం గలశృంగారప్రధానలక్షణమును ద్రోసిరాజని స్వతంత్రించి నూతనమార్గము ద్రొక్కిరని తోఁచుచున్నది. అట్లయ్యు నియ్యది ప్రబంధములలో గణనీయ మనకతప్పదు. తక్కుఁగలవిషయములఁ బాటించిన నిది సర్వవిధములఁ బూర్వపుఁబోకడలతోఁ బోలుపొందుచున్నది. కృతిమండనాయమానము లగుశబ్దాలంకారములయందుఁ బూర్వచ్ఛాయలే ప్రసరించుచున్నవి. అలంకారవిషయమై యీదిగువపద్యముల నుదాహరణంబుగఁ గైకొనం దగు.

(1) సూరులు - ప్రథమ 45. (2) శూరులు - ప్రథమ 47. (3) రాముండు - ద్వితీయ 83. (4) ఆతనితమ్ములు - ద్వితీయ 92.

ఉక్తివైచిత్రికిఁగాను దశావతారకథనమంతయు నొక్క పద్యములో నిమిడ్చినదానినిఁ గనవచ్చు. "మీనము" ద్వితీయ 71.

పూర్వకవుల పోకడలకు సరసమైన యనుసృతులు పెక్కు గలవు.

సంప్రదాయము ననుసరించి యేపద్య మెట్లు నడిపింప వలయునో లెస్సగ నెఱింగినవీరికవితయందు ధార మెచ్చు

టను గుంటువడకయున్నదని నొక్కి వక్కాణింపనగు. యథేచ్ఛగ నెచ్చట నేపద్యము చూచినను ధారాశుద్ధియాథార్థ్యమెఱుంగఁగలరు. వస్తువు నించుక సందర్శించిచూచిన నేగాథలిందుఁ జేర్పఁబడినవో యాయాగాథలన్నియు ధీరోదాత్తుఁడగునాయకుని యౌత్కృష్ట్యము చాటుటకేయని నిశ్చయముగఁ దోఁచుచున్నది. బాలకాండములోఁ గలసాహసకృత్యము లన్నియుఁ బురాణము ననుసరించి సక్రమముగఁ గథను నడిపించుటకుంగాక, కల్యాణరాముని లోకకల్యాణకృతము లతిపావనము లని భవతారకము లని సంయోగము చేయఁబడినవే కాని కథాకల్పనకుం గాదు. ప్రబంధదృష్టిని బోషించుటకై నాయకుని జన్మాదివృత్తాంతము సమయోచితముగ గ్రహించి కల్యాణనిర్వహణమునకు సమకూర్పంబడియె. లోకమున నెవ్వరును జేయఁజాలనిసాహసకృతి యగుశివధనుర్భంగము నొక్కయనామకునిచేఁ జేయింపననౌచితియని మహీజాతకరగ్రహణమునకుఁ దగినవీరుని యమానుషచరిత కల్యాణమునకుఁ బూర్వరంగముగ నమర్చి ప్రబంధమునందు వీరరసమున కగ్రస్థాన మిచ్చి ఫలావాప్తిం గాంచెను. ఈవస్తుసంవిధానమునందే దశరథవిశ్వామిత్రసంవాదము ముఖ్యముగ గమనింపఁదగినది. మూలమునకంటె నధికముగఁ బెంచినప్పటికి నియ్యది గొప్పమార్పుగా గమనింపం దగదు. ఇదియుఁ బ్రబంధపద్ధతి ననుసరించి వర్ణనవైశద్యమునకుం ద్రొక్కినమార్గమే. సత్యప్రభావ మిక్ష్వాకుకులవ్రత మనుస్సూక్తి వేయిమడుంగుల నుతింపఁబడి వర్ణింపఁబడినది.

ఇప్పట్టుననే మునికులతిలకుం డగుగాధిసుతుం డాడితప్పం జూచు రాజునెదుట వెలిపుచ్చినభావములు మిక్కిలిరసవంతముగఁ జిత్రింపఁబడినవి.

(1) నీవలనఁ — ద్వితీయ 136

(2) రవికులసార్వభౌమ — ద్వితీయ 138

(3) అన్నదానాది — ద్వితీయ 140

మూలగ్రంథములోనిశ్లోకములకు నించుమించు సరియైన యనువాదములుగూడ నటనటఁ గలవు.

ఇట్టులే యీగ్రంథమంతయు మానసకాసారతీరంబులం బోలెఁ బ్రసన్నగంభీరంబులైనరసభావవిలసనములు గల్గి యం దుద్భవంబంది యూర్యావర్తమును బవిత్రతరముగఁజేసిన సాంద్రనిర్మలఝరీపాతంబులంబోలె ననర్గళధారావిశేషంబుల నలరారి, తత్తీరలలితవనపదంబులంబోలె మృదుమధురలలిత పదవిన్యాసంబుల నందగించి యటనట స్వతంత్రప్రయోగ సంయోగంబు లంది కలాశీలుర మెప్పు లొందఁదగియున్నది. సీతాభామినిగాథతో శ్రీశ్రీ కుమారరాజాబహద్దరువారిఖ్యాతి దిగంతవిశ్రాంతమై వ్యాప్తిఁగాంచుత! ఈశ్వరుం డీకవికిశోరము లకుఁ జిరాయురున్నతు లొసంగుఁగాత!

*Vidwan* S. Viswanadha Sastry, M. A,
*Nizam College,*
HYDERABAD.



సీతాకల్యాణప్రబంధసంబంధి

# కవిపండితాభిప్రాయములు



సీ. విద్వత్కవీంద్రభావితకథాగతి, కృతి
శమితగంగాదర్పసార, ధార
పక్వేక్షురసపరీపాకంబు, పాకంబు
కైలాసపతి నృత్తకేళి, శైలి
మృదులకాంతాధరామృతపూరశుచి, రుచి
యతిలోకమధురపాయసము, రసము
పృథురత్నపరిమళావిఖ్యాతి, పదరీతి
ఘోషవతీమంజుఘోష, భాష

గీ. బళిర! భవదీయ 'సీతావివాహ' కావ్య
ఫక్కి!- సర్వోత్తమంబు, శ్రావ్యంబు, పరమ
లలిత; మోవాజపేయయాజులకవీంద్రు
లార! సుబ్రాయనారాయణార్యులార!

గుంటూరు,
13-3-'36.

కాశీ కృష్ణాచార్యులు,
అవధానిశిరోమణి.

మ. పటువాగర్థసమాసభాసురము శ్రావ్యం బవ్యయం బుత్తమో
త్కటమాహాత్మ్యఘనంబు సన్నుతము 'సీతారామకల్యాణ'
స్ఫుటకావ్యంబు రచించి కంటి రమలాపూర్వస్ఫురత్కీర్తి వెం
కటనారాయణరామసుబ్బకవిలోకగ్రామణుల్ ! మీ రిలన్

చ. అతిమధురంబు గోస్తని, మహామధురంబు మధుద్రవంబు, గ
ఘృత మిఁక నంతకన్న మధుర, మిష్టతమా లలితాధరాధరా
మృతమది యెంతయు న్మధుర; మింక భవత్కృతిపాకమో రస
యతనము, సర్వతోమధురమౌఁజూడ వేంకటరామసోదరుల్

మ. కమనీయంబు సలక్షణం బగుమహా
కావ్యంబుఁ గల్పించి సా
ర్థము, నన్వర్థము నెద్ది సత్కవులు గూ
ర్పన్ శక్తులో - తాదృశో
త్తమసారార్థము వాజపేయముఖిసో
దర్యుల్ ! భవన్నవ్యకా
వ్యముచే మీ రొడఁగూర్పఁ గంటి ; రిఁక నే
లా వేయుశాస్త్రార్థముల్ ?

ఉ. శ్రీయు యశంబు తేజము వ
శిత్వము మంగళ మిష్టసిద్ధి దీ
ర్ఘాయువు పాడిపంటలు మ
హాకృతిదక్షత పుత్రమిత్రసు

శ్రేయము శ్రీరఘూద్వహుఁడు,
సీతయు మీ కొడఁగూర్త్రుగాక! నా
రాయణసుబ్బరాయకవు
లార! భవత్కృతి కర్హ్యభూతిగన్.

మ. మిముబోంట్లం గవులన్ బుధాగ్రణులఁ గూ
ర్మిన్ దన్పి భాషాభిమా
నము దీపింప మహార్హసత్కృతిలతాం
తంబుల్ గుబాళింప స్నే
హముకల్మిం గవితాలతన్ దశదిశా
వ్యావర్తినిం జేయును
త్తమకొల్లాపురరాజ్యలక్ష్మి చిరసు
స్థాయిత్వముం గాంచుతన్.

గుంటూరు,
15-2-36.

చతుర్వేది అమరేశ్వరశాస్త్రి.

---

కవితాప్రశంస.

[ముప్పేటబన్ను సరము]

( సంస్కృతోత్పలమాలిక )

శ్రీరమణీయభర్మసరసీరుహసంపుటనిర్గళత్సుధా
సారసమానవైభవపరిసన్నలసన్నవమాధురీధురీ
ణారభటీవిమోహనకరాంధ్రకవిత్వమహత్వసత్వవి
స్తారితపాఠకావళిహృదంగణసంగతరంగవల్లియై ;

క్షీరసముద్రగర్భఫణిశేషపరీవృతమంధరాద్రిదు
ర్వారదురంతభారపరివాహకదక్షపురాణకచ్ఛపా
కారరమేశసత్కరుణకల్పితనవ్యరసామృతైకధా
రారచనాప్రమేయరుచిరప్రచురప్రతిభాలవాలమై ;

శారదనీలనీరదవిశాలరసాలరసాలయాంతరా
పారపవిత్రజీవనపిపాసితచాతకదేహధారణా
ధారపయఃప్రసారకవితానవతాభవతారకాకృతి
స్ఫారకజానకీపతియశోమయశోభనపద్యహృద్యమై ;

(తెలుఁగుకలువదండ)

తీరినవేళలందుఁ దనితీరఁగఁ బుల్గులజిల్గుపాటలన్
గూఁరెడునిండుహాయి సమకూరిచి మేల్మిపసిండితోరమా
తోరము గట్టి మానలువతొయ్యలి వియ్యములియ్యఁ జేత సిం
గారము లొల్కుచిల్కనుడికారము కారముగాఁదలంచుచున్;

బీరముమీరి కచ్చఁగొని పిల్లలు 'కో'యనఁ 'గో'యటంచు వే
మారు కవించికూసి మొలమావులకొట్టకొటారుకొమ్మలన్
దూరినగండుకోయిలలతోఁ బెనగంబడి కూఁత కూత లే
దారుల లేనివానిఁ బెనుదందడిఁ బెట్టుచు బొమ్మఁగట్టుచున్;

బారులుదీరి మంచుమలఁ బారుకొలంకులఁజేరి బొజ్జ నిం
డారఁగఁదమ్మితూండ్లు తిని యాడుచుఁ బాడుచుఁ బోవునప్పు డా
య్యారము వోరగించు తెలియంచలపాటలనీటు మాబలా
దూరని దూరనిచ్చఁగొనుదుందుడుకుందొడి యీసడించుచున్;

(జంటభాషాసరము)

కోరికమీరఁ జాతకచకోరిక లాక్కొడ బాష్పగట్టి సం
చారముసేయుచున్ గగనసంగతనీలనవాంబువాహతా
కారమణిస్ఫురద్రుచులఁ ద్రావిన నెమ్మదిఁబుట్టుచుట్టుకొ
ల్లారపుసంతసమ్ము దొరలన్ దరలించినగానమో యనన్;

తారుచు మబ్బు చాటుగొని దాగుచుమూఁతలనాడుచంద్రునిన్
గోరుచుఁ దారకల్ మగనికోసము దుర్గమశూన్యమార్గని
స్సారగవేషణం బడి విశాలఘనాఘనసత్కృపం బతిన్
జేరినవేళ మిన్కుమనుచిందులకుం దులదూగెనో యనన్ ;

కూరిమికూరి మించు బెళుకూరి మిటారిలునేటుకైతలన్
దీరిన 'సీతపెండ్లి' యనుదివ్యకథారసధామపద్యసం
భార మపారమై తనర మస్తుగ సిస్తుల గుస్తరించు చా
తారక మీమహిన్ గృతిసుధారసము ప్రవహించుఁగావుతన్.

ఇట్లు,

విబుధవిధేయుఁడు,

గుంటూరు,
21-2-'36.

అచ్యుతుని వేంకటాచలపతిరావు.

శ్లో. శ్రీనైజాంరాజ్యలక్ష్మీకరధృతవిమలాంభోజవద్భాసమానా
శ్రీమత్కొల్లాపురాఖ్యా సురభికులభువాం రాజతే రాజధానీ
యస్యాం జాగర్తి విద్వత్కవివరనికరశ్లాఘ్యవిద్యాప్రశస్తిః
రాజా శ్రీలక్ష్మరాయప్రభువరతనయః శ్రీజగన్నాథభూపః.

శ్లో. తత్ప్రోత్సాహితసోదర
కవివరయుగళేన కావ్యరసికేన
సీతాకల్యాణాఖ్యః
కృతః ప్రబంధ స్సతాం ప్రమోదాయ.

ఈసీతాకల్యాణమును రచించినసోదరకవుల నే నెఱుంగుదును. వీరిలో జ్యేష్ఠు లగురామసుబ్బారాయఁడుఁగారిచ్చటఁ గవితాసంఘమును స్థాపించి నిరంతరము 'మిత్రలేఖల'ద్వారమునఁ జేయుచున్నభాషాసేవ సాహిత్యలోక మెఱుంగనిది కాదు. సంస్థానమునందు వీరు గావించుచున్నకృషినిఁ జూచి శ్రీశ్రీ కుమారరాజా . వేంకటజగన్నాథరావు బహద్దరుగారు వీరిని బ్రోత్సహించి యీకావ్యమును రచింపఁజేసి ప్రకటించుచున్నందులకుఁ జెఱుతప్రియమునందె వీరికిఁ గలభాషాభిమానము సంశ్లాఘ్యము. జగదీశ్వరుఁడు శ్రీరాజాబహద్దరుగారికిఁ జిరాయుర్భాగ్యములను బ్రసాదించుఁగాత!

గ్రంథ మామూలాగ్రముగఁ జూచితిని. గ్రంథ మాదినుండి తుదివఱకుఁ జక్కనిశైలిం దగిలి మృదుమధురపదములతో ధారాళ మగుధారతో విరాజిల్లుచున్నది.

సోదరకవు లిరువురు సద్వంశసంజాతులు. ఇందు రెండవవారికి వేదశాస్త్రములయందుఁగూడఁ బ్రవీణత కలదు. ఇట్టిసత్కృతు లనేకము రచించి యశస్సంపదల నార్జించుటకుఁగాను సీతారాము లీసోదరకవులకు సంపూర్ణాయురారోగ్యముల నొసంగుఁగాత !

ఇట్లు

కొల్లాపురము, }
10-3-'36. }

వసం సీతారామశాస్త్రి,
ఆస్థానపండితుఁడు,
జటప్రోలు సంస్థానము,

---

శేషాద్రిరమణకవులు

(పంచరత్నములు)

క. సీతాకల్యాణము సం
జాతప్రమదమునఁ జదివి సంతోషరస
స్ఫీతమతి నైతిఁ గవితా
చాతుర్యము దన్పె నన్ను సత్కవులారా ! 1

శా. ధారాశుద్ధి ప్రధానసద్గుణముగాఁ దళ్కొత్తుమీకైతలో
నీరంధ్రంబుగ భావనాపటిమయున్ నిండారుటేకాకి శృం
గారంబౌచితికూర్పుబింకమును గంటన్ మెచ్చుకొంటి న్సుధా
ధారాస్యందిభవత్కవిత్వ మెద మోదం బెంతొ సంధించెడిన్.

మ. తెలుఁగుంబాసకు సేవఁజేయ మది నుద్దేశించి యచ్చంపుఁ
గ్గలు జగ్గల్గల మేల్మిపొత్తములఁ బెక్కుల్ గూర్చి యాంధ్రావనీ
తిలకప్రాయరసాభిరామకవితాప్తిం బేరు పెంపొందుమీ
పలుకుంబొందిక లుల్లసిల్లుత కవిప్రస్తుత్యమార్గంబులన్.

శా. సీతారామవివాహకావ్యమున వాక్సీమంతినీరత్నమున్
జేతఃప్రీతి నటింపఁజేసితిరి నిర్ణిద్రాశుధారాసము
ద్భూతప్రాభవతావకీనకృతిసందోహంబు నానారసో
పేతంబై కవిరాజగణ్యమయి యుర్విన్ మించు టబ్రంబొకో!

క. చదివినకొలఁదిని గ్రమ్మఱఁ
జదువఁగఁ గోరిక జనించుసదమలశైలిన్
మృదుమధురకావ్యనిచయము
ముదమున రచియించుమిమ్ముఁ బొగడఁగఁదగున్. 5

ఆత్రేయాశ్రమము,
అనంతపురము.

11-4-35.

కవిసోదరులును సోదరకవులును నగుబ్రహ్మశ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయుఁడుగారును, వేంకట నారాయణగారును రచించిన 'సీతాకల్యాణ' మనుప్రబంధము నీదినమునఁ దనివిఁదీర విని యానందించితిని. మధుధారావాహియగునుడికారమును సుమనోమనోహర మగుకూర్పును, నవనీతమువంటిమార్దవమును గలిగిన యీప్రబంధప్రసూనము పూర్వసత్కవులగ్రంథసుమసౌరభముల నేఁడును దలపించునదియై యాంధ్రలోకమునఁ దనసువాసనలఁ బ్రసరింపఁజేయఁగలదని నమ్ముచున్నాను.

ఈసోదరకవులు శ్రీజటప్రోలుసంస్థానమున "స్నేహలతాకవితాసంఘ" మనుపేర నొకపరిషత్తు నేర్పఱిచి తదంగముగాఁ నొక 'గ్రంథమాల'ను స్థాపించి యందమూల్యములగుగ్రంథములఁ బ్రకటించుచుఁ జాలశ్రమకు లోనయి మాతృభాషాభిమానమే ముఖ్యముగఁ దలంచి యెంతయో భాషాసేవయుఁ దన్మూలమున దేశసేవయుఁ జేయుచున్నారు. ఇట్టివీరిప్రయత్నములు సర్వదా సాఫల్యమును బొందునుగాక యని పరమేశ్వరుని బ్రార్థించుచున్నాను. వీరికృషికిఁ దగిన ప్రోత్సాహమును సాహాయ్యమును లభించుఁగాకయని కోరుమన్నాను.

**Dr. Chilukuri Narayanarao,**
***M. A., L. T., P. H. D.***

---

## మిత్రాభివందనము



బ్రహ్మశ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయుడు, బి. ఏ., గారు నాకు బాల్యమిత్రులు. సహాధ్యాయులు - చిన్ననాటనుండియు నాంధ్రభాషయన నీయన కభిమానము. పూర్వకవుల గ్రంథములయం దాదరము మెండు. వీరు హైస్కూలు క్లాసులోఁ జదువుచున్నప్పటినుండియుఁ గవిత్వముఁ జెప్ప నేర్చి మిత్రులను బ్రోత్సహించుటయెకాక వారిసతీతిలకమునకుఁ గూడఁ దెనుఁగునం దభిరుచి కలిగించి యామెకుఁగూడఁ గవిత్వ మలవడఁజేసిరి. ఎడతెగని యున్నతవిద్యాసక్తియు, మిత్రప్రయోజనాన్వేషణదీక్షయు వీరిస్వాభావికసుగుణములు. ఏపని తలపెట్టినను సమగ్రముగఁ జేయుదురేకాని సగము సగముచేయుమధ్యమలక్షణము కలవారు కారు. వీరు పాళీ భాషలోఁగూడఁ జక్కనిపాండిత్యము గాంచినవా రగుటచే, కలకత్తానగరమున నున్నరమారమి పదిసంవత్సరములలోను నాంధ్రవిద్యార్థుల కెల్ల గురువులై వారి నున్నతపరీక్షలయం దుత్తీర్ణులఁ గావించిరి.

"విద్య యనుదివ్యధనం బఖిలార్థికోటికిన్ బూర్తిగ నిచ్చినఁ బెరుగు" ననెడిన్యాయమును సార్థకముఁజేయ వీరి సంకల్పము. ఈయనకుఁ గలపట్టుదలయు, ఓపికయుఁ గడుంగడు శ్లాఘ్యము.

ఉదారస్వభావులు, కవిజనపోషకులు నగు శ్రీ రాజా సురభి వేంకట లక్ష్మారావు బహద్దర్ వారు జటప్రోలుసం

స్థానాధీశ్వరులు వీరివిద్యావినయసంపత్తికి మెచ్చి వేయార్లు బహూకరించుటయేకాక తమసంస్థానమున వీరి నెల్లకాలము పోషింప సంకల్పించి తగువసతు లేర్పఱచిరి. శ్రీరాజాగారిసతీతిలకమగు శ్రీ వేంకటరత్నమాంబామహారాజ్ఞిగారు భర్తృమార్గావలంబనాసక్తమతియుఁ, బరోపకారపారీణయు నై వీరిని సంస్థానమందు విద్యాగురువులుగ నియమించి సర్వవిధములఁ బుత్రవాత్సల్యమున నాదరించుచున్నవారు. శ్రీకుమారరాజా వేంకటజగన్నాథరావు బహద్దరువారుగూడ వీరియం దత్యంతము గురుభక్తి కలవారై వీరియాంధ్రభాషాభిమానమునకు మెచ్చికొని వీరిని వీరికవితాసంఘము ననేకవిధములఁ బ్రోత్సహించుచున్నవారని యీకావ్యమూలమునఁ దెలియుచున్నది. వీరు సల్పుభాషాసేవయుఁ, బొందుచున్న రాజగౌరవమును, స్వయముగఁ జూచుభాగ్యము నాకుఁ గలిగినందులకు సంతోషాతిశయమున నింతగా వ్రాయవలసినవాఁడనైతిని.

ఖండకావ్యములు శతకములు మొదలగుకృతుల వీరు స్వయముగ రచించుటయెకాక సంఘసభ్యులందఱచేఁ బ్రోత్సహించి వ్రాయించుచు నాంధ్రభాషకపూర్వములైనకానుకల నర్పించుచున్నారు. వీ రాశువుగ రచించిన రామామృతము, కవితాకాంతావిహారము మున్నగు గ్రంథములప్రాశస్త్యమును జూచి వీరి నొకప్రబంధము వ్రాయవలసినదిగా శ్రీకుమారరాజాబహద్దరువారు ప్రోత్సహించిరని వినినంత నేనును నాకుఁ గలయపరిమితానందమును వెలిపుచ్చితిని. రాజాజ్ఞయు మిత మనోరథమునుగూడ వీరు చెల్లించి వీరిసోదరకవితోఁగూడి

యీచక్కని ప్రబంధమును రచించి యాంధ్రలోకమున కర్పించి నందులకు నేను మిక్కిలి సంతోషించుచున్నాను. వీరి సోదర కవి యగు వేంకటనారాయణగారుకూడ సంస్కృతాంధ్రాంగ్ల భాషాప్రవీణులు. కడుసమర్థు లగువిమర్శకులు. అసమాన కవితాధోరణి కలవారు. శ్రౌతస్మార్తవిద్యాపారంగతులు. వేయేల ? వీ రన్నివిధములఁ దమయన్నగారగు రామసుబ్బా రాయఁడుగారిని బోలినవారే.

ఈసోదరకవులచేఁ జేయఁబడుభాషాసేవయు, భగవత్సేవయుఁగూడఁ గడుంగడు శ్లాఘనీయము- వీరికవిత్వము పూర్వకవిసంప్రదాయసిద్ధముగను భగవత్పరముగ నుండుట మిగుల మోదదాయకము. వీరు మృదుమధుర మైనధార గలకవిత్వ మలవడఁజేసికొని ప్రఖ్యాతిఁగాంచుచున్నందులకు మిత్రుఁడ నగునే నెంతయు గర్వించుచున్నాఁడను.

పరమేశ్వరుఁడు నిరంతరము వీరియుద్యమమున కెంతయుఁ దోడ్పడుఁగాక.

**Medicherla Venkata Jagannadham,**
*B. A., B. Ed.*
*Headmaster;*
**Member, Secondary Education Board,**
**NIDADAVOLE,**
*West Godavary Dt.*









వాజపేయయాజుల రామసుబ్బారాయ వేంకటనారాయణ సోదరకవులు,

# కృతజ్ఞత



సురభివంశ మనాదినుండి విద్వద్రాజవంశమని ప్రఖ్యాతిఁగాంచినది. అందు శ్రీమాధవరాయకృత మగుచంద్రికాపరిణయప్రబంధమునుబట్టి యేతద్వంశమందుఁ గవులుగూడ విలసిల్లిరని తెలియుచున్నది. కీర్తిశేషులైన రాజాలక్ష్మారావుబహద్దరువారుకూడఁ గవితారసపారంగతులు, గొప్పభాషాభిమానులు. శ్రీరాణీ వేంకటరత్నమాంబగారి పరిపాలనమునను బ్రకృత మీసంస్థానమున ననేకకవిపండితసభలు గావింపఁబడుచున్నవనిచెప్పినచో శ్రీరాణీగారి యాంధ్రభాషాభిమాన మిట్టిదని క్రొత్తచేసి చెప్ప నక్కఱయుండదు.

శ్రీకుమారరాజా వేంకటజగన్నాథరావుబహద్దరుగారు చిఱుతప్రాయమునందె మాతృభాషాభిమానులై విద్యాధనముకన్న మిన్న లేదని యెఱింగినజ్ఞానగుణాఢ్యు లగుటంజేసి మేము గావించుచున్న యత్కించిత్కవితాసేవ తిలకించి తగుప్రోత్సాహ మీయఁదలంచి మ మ్మొకకావ్యము వ్రాయుఁడని ప్రోత్సహించిరి. ఈవిషయము మాకవితాసంఘమునుండి వెలువడుచున్న మిత్రలేఖలద్వారమునఁ బలువురు మిత్రుల కెఱింగింపనరి దొక బాల్యమిత్రుఁడు మేడిచర్ల వేంకట జగన్నాథము, బి. ఏ., బి. ఇ. డి. గారు(**Headmaster, High School, Nidadavole**) శ్రీకుమారరాజాగారిప్రోత్సాహము మిక్కిలి

తేగియున్నదనియు, మంచిసమయమున వారు ప్రోత్సహించి నందులకు మే మెల్లరము సంతోషించుచున్నారమనియు నొక లేఖను వ్రాసి మాకుఁగలయానందము నినుమడించిరి. ఆవల మఱికొన్ని దినములకు గుంటూరులోని మామిత్రులగు బ్రహ్మశ్రీ అచ్యుతుని వేంకటాచలపతిరావుగారు చిరకాలము నుండి మాకును వారికిని నడచుచున్న " బుధస్థిరలేఖల " నియమము ననుసరించి, యొక 'స్థిరలేఖ' లో నిట్లు వ్రాసి పంపిరి.

సీ. "ఎల్లవిద్దెలలోని యెల్ల లంటెడు మేటి
దొరలు పెంచినరాచసిరుల టెంకి
అతిలోకకవిగణాశ్రితలోకభూరిసం
కల్పానుసంధానకల్పతరువు
తెలుఁగుపల్కులనీటుజిలుగుం బిసాళింపఁ
గలకైతమొనగాండ్రు నిలువనీడ
సకలవిద్వదభీష్టసాఫల్యకరరేఖ
కామహాత్వనిధానకామధేను

గీ. పన్నిగానబులకును బేరుగన్నయున్కి
పట్టు తౌరాచరతనాలపుట్టినిల్లు
సురభిశీలంబు సత్కీర్తిసురభిళంబు
సురభివంశంబు మనపాలసురభి కాదె!

మ. కవివిద్వద్గణగణ్యపుణ్యయుతమై కళ్యాణకల్యాత్మమై
రవివంశద్యుతితుల్యమై విమలసారాచారసంపన్నమై
కవితాస్నేహలతాసమాజబలమై కల్పావనీజాతమై
సవిశేషోన్నతకీర్తిమై సురభివంశశ్రీలు వర్ధిల్లుతన్. 2

శా. ఏజన్మంబున నేమినోచితిరొ ఘున్నదేవతన్ భక్తితోఁ
బూజ లొనర్చితిరో మఱేమిసుకృతంబు ల్గంటిరో లేనిచో
రాజాస్థానసరసప్రఫుల్లకవిరాడ్రాజీవరాజీవశ
భ్రాజచ్ఛ్రీజటపోలురాజ్ఞికరుణాప్రాబల్యముంగాంతురే?

సీ. వరణీయపితృజనాదరణీయసత్ప్రథ
భ్రాజత్సుధీకళారాజసుతుఁడు
చదువు నేర్పినయొజ్జ నెద నిల్పి నిండారు
మన్ననల్ గురిపించుచిన్నితేఁడు
గణనీయగుణగేయమణిమాలికామేయ
సారదీప్తిలసత్కుమారరాజు
తేనెసోనల దెప్పు తెలుఁగుకైతల నంది
రాణించుగారాబురాచపట్టి

గీ. సకలశ్రీశ్రీకుమారరాజాబహద్దు
రైన శ్రీమజ్జగన్నాథరాయవిభుఁడు
జిలుగుకబ్బంబు లందుచున్ దెలుఁగుబాస
మేలుఁ బెంచి నూఱేండ్లు మి మ్మేలుఁగాక! 4

శా. ఎట్టెట్టో నిజపూర్వపుణ్యవిభవం బీనాల్కకుం గైతలన్
గట్టన్ దానికిఁదోడు భూపతులసత్కారంబు నీయందుఁ గ

న్పట్టెంగాయని నామనంబు నడిమింటన్ దూగసంతోషమున్
బట్టంజాలక పొంగి పాడితి భవద్భాగ్యోన్నతిన్ మిత్రమా!"

ఈసమయమునందే జగద్విఖ్యాతపురుషులును, శతావ
ధానధనులును నగు శేషాద్రిరమణకవులలో నొకరగు శ్రీమాన్
వేంకటరమణాచార్యులవారు మాయందుంగల స్నేహవాత్స
ల్యము ననుసరించి యొకమిత్రలేఖలో నీదిగువపద్యములను
వ్రాసిపంపిరి.

సీ. "సురభిమాధవరాయశుద్ధాంతకాంతయై
కవితాలతాంగి యెక్కడఁ దనర్చె
బాలసరస్వతి భాషాప్రపంచంబు
పాలించి యెచ్చోటఁ బ్రఖ్యఁగాంచె
తాల్మి సహస్రావధానసంగతపద్య
వర్షంబు కురిసె నేపట్టణమున
అల సదాశివశాస్త్రి యనుపమచాతురీ
జనితయశంబుఁ గైకొనియె నెందు

గీ. ఆంధ్రవాఙ్మయసేవకై యఖిలయువక
వితతి పూజాసుమాళితో వెంబడింప
భారతికి నెందు నీవు పూజారి వైతొ
యల్ల కొల్లాపురంబె ధన్యంబు సఖుఁడ! 1

సీ. ఘనుఁడైన సురభిలక్ష్మణరాయభూపతి
యోగ్యుఁడ వని వృత్తి నొసఁగినాఁడు
కార్యదీక్షయును యోగ్యతఁ జూచి తద్రాజ్ఞి
కన్నబిడ్డనుబోలె గారవించె
రసికులా యువకులు రసపిపాసఁ దలిర్పఁ
జేదోడు వాదోడు చేసినారు
ఆంధ్రలోకంబు నీయనఘసేవాసక్తి
చిత్తమం దెంచి హర్షించినారు

గీ. కఠినమాత్సర్యలోలమౌ కవికులంబు
భవ్యవాఙ్మయసేవనవ్రతము పేరి
దివ్యరజ్జువుచేత బాధితుల రగుచు
నుందు రీ వెనువెంట నెంతధన్యుఁడవు సఖుఁడ! 2

క. పిన్నలఁ బెద్దలఁ జేరిచి
కొన్ని ప్రబంధముల నచ్చుఁగూరిచి తెలుఁగుల్
మిన్నందఁ జేయు నీకడ
నున్నా నను కొమ్మి వచ్చియుండకయున్నన్. 3

క. పువులం గ్రుచ్చెడిపోలిక
చవిగాఁ బద్యములఁగూర్చి సత్కవిలోక
శ్రవణాలంకృతి సల్పెడి
కవికిన్ నీ కగుత నిత్యకల్యాణంబుల్. 4

శ్రీకుమారరాజాగారిప్రోత్సాహమునకు సంతసించి పలువురుమిత్రులీతద్గ్రంథరచనమునకై ప్రోత్సహించుటచే సీతారాములపై భారముంచి యోపినకొలఁది వ్రాసి ముగించినారము. శ్రీకుమారరాజాబహద్దరుగారు గ్రంథమును విని సంతసించి ప్రకటనభార మంతయు వహించి మమ్ములను గృతార్థులను జేసిరి. శ్రీరాజావారికి మాయందుఁ గలగురుభక్తియు, మాతృభాషాభిమానమును, సౌశీల్యసౌజన్యాదిగుణసంపత్తియు వర్ణింపరానివి. ఈవిధముగ మాచే స్థాపింపఁబడిన కవితాసంఘమును బ్రోత్సహించుచున్న శ్రీకుమారరాజా వేంకటజగన్నాథరావు బహద్దరువారిని వారి యిలువేల్పగు లక్ష్మీనృసింహేశ్వరుఁడు సకలసౌభాగ్యసంపత్తులతోఁ జిరాయురున్నతులఁ బ్రసాదించి సంరక్షించుఁగాత! సంస్థానవిద్యాశాఖపై నధికారపదవి నొసంగి, రాజపుత్రులకు గురువుగ నియమించి మాచే నెట్లో నాటఁబడినకవితాలతకుఁ జక్కని యాధారబంధముతో ననేకదోహదములు, పాఁకులు, జీవనోపాధులు గూర్చి పోషించుచున్న శ్రీ వేంకటరత్నమాంబికా మహారాజ్ఞీమతల్లిగారిని స్వారాధ్యమానేష్టదేవతయగు లక్ష్మీదేవి సంపూర్ణాయురారోగ్యభాగ్యసమృద్ధితో సర్వవిధములఁ గాపాడుఁగాత! తద్రాజకుటుంబ మాచంద్రార్క మవిచ్ఛిన్న సంతానమై పుత్రపౌత్రప్రపౌత్రాభివృద్ధిం గాంచుచుండుఁగాత! తన్మహారాజ్య మింతో నధికవిస్తీర్ణతం బెరుఁగుఁగాత!

---

## శ్రీశ్రీ కుమారరాజాబహద్దరువారికడ గ్రంథరచనాప్రోత్సాహసందర్భమున మాచెప్పినపద్యములు.



శా. నీకారుణ్యము నమ్మి కావ్య మెటులో నిర్మింపఁగా నెంచి ని
ర్భీకంబౌగతి నొప్పుకొంటి మిఁక సత్ప్రేమానుబంధంబునన్
సౌకర్యం బొనఁగూర్చి మాదగుప్రయత్నమ్ము న్ఫలింపందగన్
జేకూర్పంగదవయ్య ధైర్య మెదలో సీతామనోనాయకా! 1

మ. కరుణాపూరముఁ జిల్కునీదగుకటాక్షం బింత తోడైనచో
సరసాలాపవిలాసవైభవమునన్ సత్కావ్యనిర్మాణచా
తురి గాన్పింపఁగఁ గైత లల్లి శుభకీర్తు ల్గాంచి విద్వత్సభా
దరణీయం బగుశోభనప్రతిభ చేతన్ గాంచమే ధన్యతన్. 2

చ. ఘనుఁడవు రాజచంద్రుఁడవు కావ్యము వ్రాయఁగఁ బ్రోత్సహింపఁ
నినసుగుణప్రపూర్ణుఁడవు నిర్మలకీర్తిలతానిధానమం [బూ
చనఁదగుసత్కళాకరుఁడ వౌట భవద్వచనం బమోఘమా
నని మది నెంచి కావ్యము నయమ్మున వ్రాయఁగ నుంటి
[మోప్రభూ !

శా. కమ్మం దేనియలొల్కుమేల్నుడు లెసంగంబల్కి మమ్మీవు కా
వ్యమ్మున్ వ్రాయఁగఁ బ్రోత్సహించితి వశక్యంబైనకార్యంపుభా
రమ్మున్ మాభుజమందు వైచితివి నీరాజత్కృపాప్రాప్తిచే
నిమ్ముంగాంచి రచింపనెంచితిమి రాజేంద్రా! దయంజూడుమీ!

మ. భవదీయోజ్జ్వలమిత్రభావమున సంప్రాప్తించె నీభాగ్యమం
చవనిం బ్రాణములుండుదాఁక నెద నిత్యం బెంతు మాపద్మసం
భవవాణీశ్వరసత్కృపాకలనచేఁ బ్రాప్తించు మోక్షంబు ధీ
జవముల్ ధైర్యబలంబుఁ గల్గదె ? భవత్సాంగత్యసంపత్తిచేన్.

మ. కవితాపాండితిసంగ్రహించితిమి వేడ్కన్ మాగురుల్ సెప్పఁగాఁ
గవితన్ నేర్చినదాది సర్వశుభముల్ గల్గెన్ సుఖం బబ్బె వై
భవముల్ సేకురె రత్నమాంబకృపకుం బాత్రత్వముంగంట నే
లవముంగల్గదు లోటు మాకు నెపుడున్ లక్ష్మీకృపాలబ్ధిచేన్.

శా. ఏజన్మంబున నోఁచినట్టిఫలమో యిట్టీకవిత్వంబు రా
గాఁ జెల్లెం దగఁ బ్రోత్సహించెను మమున్ గావ్యంబు నిర్మింప మా
రాజశ్రేష్ఠుఁడు ; నీవ దాని నెరవేర్పంగావలెన్ గావ్యమున్
రాజిల్లంగను జేయఁగావలె జగన్నాథా ! కృపాదృష్టిచేన్. 7

గీ. కావ్యము నొకండు లిఖియింపఁ గడఁగ వలయు
నంచు శ్రీజగన్నాథునినిమించు వేడ్క
నూతఁగాఁ గొని యత్నించియుంట, దీని
నాజగన్నాథునకు నిత్తు మంకితముగ.

ఇట్లు బుధజనవిధేయులు,

సోదరకవులు.

శ్రీమత్పరదేవతాయై నమః

# శ్రీ సీతా కల్యాణము

## ప్రథమాశ్వాసము



శ్రీ రామాహ్వదయేశ్వరుండు కరుణా
సింధుండు లోకావనో
దారుం డార్యులఁ బ్రోవ దుష్టజనులన్
దండింప జన్మించి, స
ర్వారాధ్యం బొనరించె నెద్ది యది యా
ర్యావర్తనామంబునన్
శ్రీరమ్యంబును దేశరాజ మగుచున్
జెన్నారు నెక్కాలమున్.

మ. తరమే వింధ్యహిమాచలాంతరపవిత్రక్ష్మాతలిం బుట్టి, వే
దరహస్యంబు లెఱింగి బ్రహ్మఋషియై ధన్యాత్మమాహాత్మ్యమే
వ్వరికైనన్ లవమాత్రముం దెలిసి సంభావింపఁగా నీచరా
చరవిశ్వైకవిధాత ధాతకయినన్ శక్యంబుగా దన్న చోన్.

ఉ. మిక్కుటమైనగర్వమున మింటికి నంటఁగ నిక్కువింధ్యము
న్నొక్కఁగఁజేయ వార్ధి జలశూన్యముగా నొనరింప నింపఁ జే
రుక్కున బ్రహ్మనిర్మితికి నుద్దిగ సృష్టియొనర్పఁజాలువా
రిక్కడఁ గాక లోకమున నెక్కడనైన జనింపఁగల్గిరే? 3

శా. వాదంబందున నీశ్వరుక్ గెలిచి తత్ఫాలేక్షణౌద్ధత్యముం
బాదస్థం బగునట్లుఁజూపి సమయింపక్ సర్వలోకైకర
క్షాదక్షుం గమలాక్షు మాధవుని వీఁకం దన్నఁగాఁజాలువా
రీదేశంబునఁగాక పుట్టుదురె యిం కేదేశమం దేనియుక్. 4

చ. చతురంభోధిపరీతసర్వధరణీసామ్రాజ్యపద్మాలయా
పతిమాణిక్యకిరీటకాంతికలనాభాస్వత్పదాంభోజులా
క్షితిగీర్వాణులజన్మభూమి యగుసుక్షేత్రంబు నీహారప
ర్వతవింధ్యాచలమధ్యగం బయిన యార్యావర్తదేశంబకా.

మ. కలనైనం దమసౌఖ్య మెన్నక, మహాకష్టంబులక్ సైచి, ని
చ్చలు ధర్మం బవలంబనంబుగఁ బ్రజాసౌఖ్యంబె లక్ష్యంబుగాఁ
గలకాలం బిల యేలి శాశ్వతయశఃకాయంబులక్ వెల్గుభూ
పలలామాయుతజన్మభూమియగుచుక్ భాసిల్లుదేశం బిదే.

మ. చిరకాలంబు ధరిత్రి నేలి విపులశ్రీభోగముల్గాంచి, సు
స్థిరకీర్తిక్ విలసిల్లి యైహికసుఖస్నేహంబు గర్హించి, మో
క్షరతిక్ గానలకేగి యోగులయి దీక్షక్ బ్రహ్మముంగన్నభూ
వరు లీదేశమునందకాదె యుదయింపంజాలి రెక్కాలముక్.

మ. రణమే స్వర్గము మోక్షమంచు నితరారంభంబుల న్మాని ధా
రుణిఁ గంపింపఁగఁ జేయుసైన్యముల నిర్మూలంబుఁగావించి, వీ
రనరవ్యాఘ్రములన్ వధించెడిమహోగ్రస్ఫూర్తుతొమార్తురన్
క్షణమాత్రంబున రంభఁ జేర్చినఘనుల్ జన్మించి రిందేకదా.

ఉ. ఆడినమాట నిల్పుకొన నంచితరాజ్యము వీడి కానకున్
జేడియతోఁ గుమారకుని జేర్చి కడుంగడు గాసిఁ జెంది, పూఁ
బోఁడిని బుత్రి నమ్ముకొని పొక్కక మాలనిఁ గొల్చురాజు లీ
రేడుజగంబులందు జనియించిరె, యిక్కడఁగాక యెక్కడేన్?

ఉ. ప్రాణభయంబుఁ జెంది యభయంబును వేఁడిన నెట్టివారి సం
త్రాణమొనర్పఁబూని కదనం బొనరింపఁగ వచ్చెనేని యా
స్థాణువునే నెదుర్పఁగలసాహసికోత్తమవీరభూపసం
తానము పుణ్యభూమిపయిఁదక్క మఱెక్కడనైన నున్నదే?

ఉ. దేహి యటంచు వేఁడఁ జనుదెంచినయాచకకోటి కెందు సం
దేహము లేక ముక్కలుగ దేహమునైనను గోసియిచ్చును
త్సాహము సాహసంబు సహజంబులుగాఁ గలదానవీరసం
దోహము పుణ్యభూమిపయిఁ దోఁచునుగాక మఱెందుఁ
[దోఁచెడిన్. 11

సీ. కలికంఠునకుఁ దృప్తిఁగావింప సుతునైన
వండి వడ్డించెడిభక్తవరులు
కలనైనఁ బరకాంతఁ గన్నెత్తి కనఁబోని
స్థిరచిత్తు లేకపత్నీవ్రతులును

రంభాముఖాప్సరోరమణీమణులపా్రిఢి
సంచలింపనిబ్రిహ్మచారివరులు
చంద్రసూర్యులనైన శాసింపఁగాఁజాలు
నలఘుపతివ్రితాతిలకములును

గీ. వేనవే లుద్భవంబంది విమలకీర్తి
చంద్రికల నెల్లదిక్కులఁ జల్లి పుణ్య
భూమి యనుపేరు సార్థకముం బొనర్చి
రహహా ! యీదేశభాగ్య మేమనఁగవచ్చు. 12

చ. సకలకలాప్రిపీణులయి సర్వచరాచరతత్త్వవేత్తలై
యకుటిలచిత్తవృత్తులయి యక్కటికంబున నజ్ఞమానవ
ప్రకరము మేలుకొల్పఁగఁబురాణములన్ లిఖియించిధన్యులౌ
సుకవులజన్మభూమియనుచుం బొగడొందిన దిద్దియేకదా.

సీ. అత్యున్నతము నిర్జరాంగనాకీ్రిడార్హ
మగుహిమాచల మింద యలరుఁగాదె
లోకైకపావనం బాకాశవాహిని
యింద సొంపుగఁ బ్రివహించుఁగాదె
మేలిసస్యంబుల కాలవాలము లైన
క్షేత్రింబు లింద రాజిల్లుఁగాదె
యఖిలమృగాధారమై సాంద్రితమమైన
కాననావళి యింద కా్రలుఁగాదె

గీ. ఎందు లేనట్టిపశుపక్షు లెందులేని
పుష్పఫలములు నిప్పుణ్యభూమియంద
కాదె నేత్రోత్సవంబుగాఁ గానుపించు
నిందు లేనట్టిచిత్రంబు లెందుఁ గలుగు ? 14

సీ. చచ్చి సంయమనికిం జనియున్నవారలఁ
జేవమై జీవింపఁజేయువారు
మరణమందనియట్టివరముఁ గాంచినవారి
క్షణములో నవలీలఁ జంపువారు
బొందితోఁ గైలాసమును బొందు పేరాసఁ
గోనువారి కడియుఁ జేకూర్చువారు
సురలోకమునఁ జాల సుఖియించువారల
నవని కాకర్షించునట్టివారు

గీ. పురుషులను స్త్రీలుగా మఱి పూవుఁబోండ్లఁ
బురుషులుగ మార్చువార లిప్పుణ్యభూమి
నేకదా పుట్టుచుందు రనేకు లిట్టి
జనపదంబును నుతియింపఁజాలు నెవఁడు ? 15

శా. ఆర్యావర్తమునందకాదె జననంబందన్ వలెం బూర్షుఁ డా-
శ్చర్యామోదరసాబ్ధి మున్గి జనముల్ శ్లాఘించునిష్కామస
త్కార్యావార్యభరంబు మోసి ధరణీతారేశతారావళీ
సూర్యుల్ ధ్రూపరుదాఁకఁగీర్తిమయుఁడై శోభిల్లఁగాఁగోరుచోన్

గీ. సర్వసంస్తుత్యవస్తుసంచయములకును
బరమపావననిమ్నగావరములకును
సన్నుతానంతశక్తిసంపన్నులకును
బుట్టినిల్లగునిప్పుణ్యభూమియందు. 17

గీ. వెలయు దేశంబులందున నలఘుసౌఖ్య
ములకు నిలయంబులై యుత్తములకు వాని
వర్యులకు జ్ఞానధనుల కావాసము లయి
వాసిఁ గనుచుండునుత్తరకోసలములు. 18

సీ. అందలియారామసందోహమున కొగ్గి
వందనంబులఁ జేయు నందనంబు
అందలికాసారబృందమ్మునకుఁ బ్రణా
మంబుల నర్పించు మానసంబు
అందలిపురవరసౌందర్యమునకు జో
హారుగావించు నయ్యమరపురము
అందలివిమలాపగాంబుమాధురి కెప్పు
డంజలిగావించు నమృతరసము

గీ. అందుఁ గలపుష్పఫలభూరుహముల కమర
తరువు లన్నియు నమ్రతఁ దలలు వంచు;
అందుఁ గలధేనుసంతతి కమరగవియు
సాటిరాకుంటచే నమస్కార మిడును. 19

సీ. ఎచ్చోటఁ గనుఁగొన్నఁ బచ్చనై సకలస
స్యాలంకృతంబులై యలరుపొలము
లేచాయఁ జూచినఁ బూచి దిక్కులను నె
త్తావులఁ జల్లునుద్యానవనము
లేవంకఁ గాంచిన నింపారుఫలవృక్ష
రాజిరాజత్ప్రియారామవితతు
లెందు వీక్షించిన నిందీవరాంభోజ
సౌందర్యవిపులకాసారచయము

గీ. లెచటఁ దిలకించినను స్యందనేభతురగ
ముఖ్యములరాకపోకలఁ బొలుపు మిగులు
రాజమార్గంబు లన్నసత్రములుఁ బ్రబలు
భాసురము లైనయుత్తరకోసలముల. 20

మ. సతతంబున్ బహుభక్తియుక్తవరివస్య ల్సేయుశిష్యాళికిన్
శ్రుతిమర్మంబులఁ దెల్పుచు న్సరసిజాక్షు న్సర్వలోకేశ్వరున్
వితతాత్మీయసమాధియోగమహిమన్వీక్షించుచుం బొల్చుభూ
రితపోమాన్యులనైకపర్ణనిలయశ్రీ లొప్పు నాభూములన్.

సీ. హరిహరముఖ్యదేవాలయంబులతోడ
నత్యున్నతాగ్రసౌధాళితోడఁ
బద్మాలయంబులౌ పణ్యవీథులతోడ
రమణీయకమలాకరములతోడ

సకలవర్ణాశ్రయసత్రశాలలతోడ
బాలికాబాలురబడులతోడ
సుందరీసత్సభామందిరమ్ములతోడ
సర్వవృక్షారామచయముతోడ

గీ. సతతసంతృప్తసజ్జనసమితితోడ
నమితనేత్రోత్సవము సేయునగ్రహార
శతసహస్రము లానందగతిఁ జెలంగ
భాసురము లగునుత్తరకోసలములు. 22

సీ. విప్రులెల్లరు వేదవేదాంగవేత్తలై
శిష్యావళికి బోధ సేయుచుంద్రు
క్షత్రియు లౌదార్యసాహసంబులకల్మిఁ
జెలఁగి యెల్లరిని రక్షించుచుంద్రు
వైశ్యులు సకలసంపన్నులై క్రయవిక్ర
యాదులయెడ ధర్మ మరయుచుంద్రు
పాదజు లత్యంతభక్తి భూసురముఖ్య
జనసేవ లనిశంబు సలుపుచుంద్రు

గీ. భామ లెల్లరుఁ బతిభక్తి వరలుచుంద్రు
పురుషు లెల్లరుఁ దమతమపువ్వుఁబోండ్లఁ
గూర్మిమై నేలుకొనుచుంద్రు కొమరుమిగులఁ
గోర్కులను దీర్చి యుత్తరకోసలముల. 23

సీ. కంజాతభవమనఃకంజాతసంజాత
మానసంబునకుఁ గుమారి యగుట
కాలకంఠావాసకైలాసశిఖరీంద్ర
రోన్నతాగ్రవిహార మూనియుంట
హరిపదాంబుజసంభవాకాశవాహినీ
సంగమంబున మాన్యచరిత యగుట
బ్రహ్మర్షినిలయపావనపుణ్యభూమిపై
మించి నిచ్చలుఁ బ్రవహించుచుంట

గీ. శాశ్వతానంతయశమును సంతరించి
పరమపావనజీవనభరిత యగుచు
వెలయుసరయూనదీమణివిహరణముల
భాసురము లగునుత్తరకోసలములు. 24

ఉ. ఆసరయూనదీతటమునం దలరారెడిపట్టణంబులన్
వాసినిగాంచి మానులకుఁ బండితవర్యుల కిద్ధభూభుజా
గ్రేసరవైశ్యశూద్రులకు శ్రీరమణీమణికిన్ నివాసమై
భాసురమానయోధ్య యనుపట్నము కోసలరాజధానియై.

క. ఆపురి వైవస్వతమను
భూపాలకనిర్మితము నభోమణికులసం
దీపకభూపలలాముల
కాఁపురమై వెలయు సౌఖ్యకందం బగుచున్. 25

గీ. ఎంతబలవద్రిపులకైన నెన్నఁడైన
నాక్రమింప నసాధ్యమై యలరుకతన
నొప్పె నాపట్టణమున కయోధ్య యనెడు
పేరు సార్థకమై శత్రుభీకరముగ. 27

చ. ఇనకులరాజసింహులయహీనపరాక్రమసంపదున్నతుల్
ఘన మగునీవి ధర్మరతి క్షాంతియుఁ దక్కినసద్గుణంబులున్
బనివడియారసాతలమువారికిఁ జాటి వచింప నేగనో
యనఁగడులోఁతుగా నలరు నప్పురఖేయ మలేఖ్యపద్ధతిన్.

చ. ఖరకరవంశభూవరులగాఢయశంబు నగ త్తపోలికన్
సురలకుఁజాటనేగె ననుసొంపున స్వర్గము నంటుచుండు న
ప్పురవరసాల; మించుకయుఁ బోలిక గా దలచక్రవాళభూ
ధరమును దాని కున్నతిని;దబ్బరగా దిది యెంతమాత్రమున్.

శా. ద్వారంబుల్ నలువైపులం దనరుఁ దత్ప్రాకారమం దున్నత
శ్రీరమ్యంబులు తత్కవాటములు దుర్భేద్యంబు లుద్దండు ల
ప్పౌరుల్ వానిని మూసి రేని యముఁడు న్బాదం బిడంజాలఁ డే
ద్వారల్ శత్రులు పట్టనేర్తురు పురిం బ్రజ్ఞావిశేషంబునన్?

గీ. అరుల కేరికిఁ జొరరానియప్పురంబు
పొడవు పదిరెండుయోజనములు వెడల్పు
మూఁడుయోజనములు సమభూమియందుఁ
గరము సౌఖ్యాకరంబుగాఁ గట్టఁబడెను. 31

ఉ. వారణము ల్రథంబులును వాజిసమూహములు న్మహాంగమా
ర్వీరసహస్రముల్ నడువ వీలుగఁ దత్పురవీథు లెంతయున్
దీరుగఁ దిన్నగా మిగుల దీర్ఘములై నునుపై విశాలమై
పారెకు సన్నుతింపఁదగుచాడ్పున నొప్పు మనోహరంబులై.

ఉ. చల్లనివై సువాసనలఁ జల్లుచుఁ బాంథమనఃప్రియంబు సం
ధిల్లఁగఁ బిల్లతెమ్మెరలు త్రిమ్మర నప్పురపల్లవాధరల్
జల్లుచునుంద్రు వీథుల నజస్రముఁ జల్లనినీరు పుష్పముల్
వెల్లుగ నించుకైనఁ గనుపింపదు ధూళి మచెట్టివేసవిన్.

ఉ. ఆప్పురసౌధయూధముల నాడెడుచేడెలఁ గూడియాడఁగా
దాపున నుందురంభయు ఘృతాచియు నూర్వశితక్కువారలున్
గోపురభామినీమణులు కోరికమైఁ జనుదెంతు రన్నచో
నాపురసౌధరాజనిచయాగ్రసముచ్ఛ్రియ మెన్నశక్యమే?

గీ. ప్రమథగణముల నలరారుస్వర్గమట్లు
వెలయు నవ్వీటికోటకొమ్మలు సమస్త
యంత్రములతోడ వివిధశస్త్రాళితోడ
నాయిత మ్మగునుగ్రసైన్యములతోడ. 35

గీ. మిగుల నెత్తగుమేడలమీఁద నెత్తఁ
బడినజెండాలు సురలోకవనజముఖుల
వ్రేలుపయఁటలవలెఁ దోఁచు వీథులందు
నిలిచి చూచెడువారికన్గలువ లలర. 36

సీ. బంగారుపూఁతలసింగారముల్ గల్గు
 రమణీయ మైనసౌధములు కొన్ని
వెండిపూఁతలమేటివెన్నెలల్ వెదచల్లు
 నతులమనోజ్ఞగేహములు కొన్ని
కుడ్యకీలితరత్నకోటికాంతుల విలా
 సములఁ జెన్నారుధామములు కొన్ని
మయవిశ్వకర్మాదిమహనీయులకు నబ్బు
 రముఁ గొల్పుభర్మ్యహర్మ్యములు కొన్ని

గీ. యిట్టివేగాని "చూడ నిం దేమియంద
మున్న" దనిపించువిరచన యొక్కఁడైనఁ
గానఁబడ దెందు మచ్చునకైన భాను
వంశనృపధామ మైనయప్పట్టణమున. 37

గీ. ఎందు లేనట్టియంత్రమ్ము లందుఁ గలుగు
నెందు లేనట్టిభోగంబు లందుఁ గలుగు
నెందు లేనట్టియానంద మందుఁ గలుగు
నెందు లేనట్టిసుందరు లందుఁ గలరు. 38

ఉ. అచ్చటిపాడిపంటలును నచ్చటివస్తుసమృద్ధి నైకసం
పచ్చయముల్ రథంబులును వైరివినాశకరాయుధంబులున్
జిచ్చరపిడ్గులో యనఁగఁ జెల్లుమహారథులు న్బలాఢ్యులున్
వచ్చునకైనఁజూతమనిన న్గనఁబోము మ రెందు నేనియున్.

సీ. సుందరీసుందరబృందంబు దేహంబు
లందు నలందెడుచందనంబు
పంకజాక్షులు ఫాలభాగంబులం దిడు
మించునామంబులమృగమదంబు
సరసిజముఖు లురోజములం దలందెడు
సరసపకా పునుఁగును సంకుమదము
అంగనారత్నము లలకమ్ములకుఁ బూయు
నలఘుసువాసనల్ గలుగునూనె

గీ. ధూపధూమంబులును హోమధూమములును
గలసి పురమెల్లఁ గమ్మతావులకు నిరవు
గాఁగ నొనరించి యందలిగాలి కమర
గంధవహుఁ డనునామంబుఁ గలుగఁ జేయు. 40

సీ. అఖిలవస్తుసమృద్ధి నలరారునంగళ్ళు
హరిహరముఖ్యదేవాలయములు
నాటకశాలలు నర్తనాగారముల్
వైద్యశాలలు సభాభవనములును
పాఠశాలలు గ్రంథభాండారములు చిత్ర
శాలలు కేళికాశైలములును
వ్యాయామరంగముల్ న్యాయస్థలంబులు
కొమరారుతోటలు గోపురములు

గీ. సరసులును యుద్ధరంగముల్ సత్రములును
బెక్కు లప్పురిఁ గల వవి లెక్కవెట్టఁ
దరమె సురగురుశారదావరులకైన
వేయినాల్కలు గలభోగివిభునికైన. 41

ఉ. రచ్చలుఁ బణ్యవీథులును రాజపథంబులు సత్సభాస్థలుల్
వచ్చుచుఁ బోవుచుండుపురవాసులతోడను నేత్రపర్వమౌ
వచ్చటిముచ్చటల్ గనఁగ నాస్థను వచ్చెడినట్టివారితోఁ
నిచ్చలు నిండియుండును గణింపఁదరంబె జనాళిసంఖ్యయున్.

సీ. వేదశాస్త్రపురాణవాదంబులను జేయు
పండితప్రవరులభాషణములు
సంగ్రామరంగప్రశంసల నలరారు
పార్థివసింహులభాషణములు
క్రియవిక్రియక్రియాకౌశలంబును దెల్పు
వైశ్యావతంసులభాషణములు
వృషధేనుసస్యాదివిషయచర్చల నొప్పు
పాదజశ్రేష్ఠులభాషణముల

గీ. సుకవిగాయకనటవిదూషకవతంస
బహువిధానల్పశిల్పిసంభాషణములఁ
బుట్టుకలకలముల్ మిన్నుముట్టుచుండు
నెల్లవేళల నప్పురతల్లజమున. 43

చ. కలరు వసిష్ఠముఖ్యమునికాంతులు నిర్మలయోగదృష్టిచే
నిల నెపు డేపదేశమున నెయ్యది వర్తిలునో యెఱింగి, రా
జుల కది తెల్పి యుక్తమగుచొప్పున వారిని ధర్మపాలనా
కలితులఁజేయువారు విధికల్పులు పెక్కురు తత్పురంబునన్.

ఉ. సూరులు జ్ఞానదృష్టిపరిశోధితవేదపురాణసత్కలా
సారులు యజ్ఞదానజపసత్యసమంచితసర్వసన్నుతా
చారులు నమ్రశిష్యజనసారససూరులు నైకసద్గుణా
ధారులు సర్వలోకహితధర్మవిచారులు పౌరు లప్పురిన్.

సీ. తాత యైనవిధాత తా వేదవేత్తయే
ధారణాబలమెల్లఁ దగ్గకున్నె ?
పంకజోద్భవుఁ డైనపరమేష్ఠి యనఘుఁడే
యణుమాత్రమును బంక మంటకున్నె ?
స్వర్ణగర్భుం డైనస్రష్ట యుదారుఁడే
కాంచనలుబ్ధుండు గాకయున్నె ?
చతురాననుఁ డగుప్రజాపతి శ్రేష్ఠుఁడే
యనృతంబు నెపైన నాడకున్నె ?

గీ. యనుచు బ్రహ్మను నిరసింతు రప్పురమునఁ
గలుగువిప్రులు ధారణాకలితు లనఘు
లత్యుదారులు సంతతసత్యసంధు
లఖిలలోకైకపూజ్యులు నగుచు నెపుడు. 46

ఉ. శూరులు నైజకాంతిజితసూరులు సజ్జనసంఘరక్షణో
దారులు దుర్మదాంధరిపుదంతిమృగేంద్రకిశోరు లంచితా
కారులు దానధర్మగుణగౌరవభూరిగభీరతాకృపా
హారులు విక్రమోజ్జ్వలవిహారులు రాజకుమారు లప్పురిన్.

సీ. భూరివిశ్వంభరాభారంబు నొకచేత
భరియింపఁగాఁ జాలు బాహుబలము
పిడుగు నేనియు నొక్కపిడికిటఁ బట్టంగఁ
జాలునత్యద్భుతసాహసంబు
కల్పభూజమునకుఁ గామధేనువునకుఁ
దలవంపుఘటియించుదానగుణము
నెల్లలోకంబులు నేకమై పైఁబడ్డఁ
దలఁకకుండెడుమహాధైర్యగరిమ

గీ. ధర్మరక్తియు నీశ్వరధ్యానసక్తి
విప్రతల్లజపాదారవిందభక్తి
సహజగుణములుగాఁ దోఁచు క్షత్రియులకు
రమ్యమై యొప్పునట్టియారాజ్యమందు. 48

సీ. సరి చిల్లిగవ్వ మించని పెట్టుబడితోడఁ
జిటికలోఁ గోటు లార్జించువార
లలకుబేరునకైన నాశ్చర్య మొదవించు
నతులసంపదలతో నలరువార

లడుగుటెల తడవుగా నధికవిత్త మొసంగి
మించి యర్థుల నాదరించువార
లెంతరాబడి యున్న నిసుమంతయును స్వప్న
మందైన గర్వింపనట్టివారు

గీ. దైవభూసురభక్తితోఁ దనరువారు
క్షత్రియులపొంత నమ్రత జరగువారు
పాదజులయెడ వాత్సల్యభావ ముంచు
వార లప్పురమందలి వైశ్యవరులు. 49

శా. స్వామిద్రోహముపొంతఁబోక భగవత్పాదారవిందంబులన్
నీమంబొప్ప భజించుచున్ నిరతసంతృప్తిం గృషింగొల్పు చ
త్త్యామోదస్థితి దేవభూసురనరేశార్యాదులం గొల్చుచున్
క్షామం బెన్నఁడెఱుంగకుంద్రు పదజు ల్సంపన్నులై తత్పురిన్.

సీ. పుత్రపౌత్రకళత్రమిత్రసంపద గల్గి
యతులితైశ్వర్యపర్యాప్తి గల్గి
పాడిపంటలు గల్గి వారణహయధేను
వృషరాజముఖ్యాభివృద్ధి గల్గి
కాంచనమణిమండనాంచితమృదుచేల
మహనీయవస్తుసామగ్రి గల్గి
సుందరోన్నతభర్మమందిరంబులు గల్గి
డోలికాందోళికాపాళి గల్గి

గీ. సతతసంతృప్తియును మహాసౌఖ్యములును
నాయురారోగ్యములు గల్గి యధికయశము
గలిగి యన్నిఁట ధన్యులై యలరుచుందు
రప్పురంబున నివసించు నఖిలజనులు.

సీ. మృష్టాన్నభోజనతుష్టిఁ బొందినవారు
తాంబూలరంజితాధరమువారు
మణిమయకాంచనమకుటముల్ గలవారు
కంకణగ్రైవేయకములవారు
హారకేయూరరమ్యాకారములవారు
కమనీయభర్మచేలములవారు
చందనలిప్తాంగసౌరభములవారు
సుమమాలికావిలాసములవారు

గీ. సంకుమదమృగమదముఖ్యపంకకలిత
కంఠములవారు పరిమళకమ్రతైల
సంస్కృతాంచితకేశసంచయమువారు
నప్పురంబున నివసించు నఖిలజనులు. 52

సీ. తమతమవర్ణధర్మములఁ దప్పనివారు
దైవభక్తులు మహాదానపరులు
సత్యసంధులు కృతజ్ఞతఁ గల్గువారలు
పరగుణప్రీతిచేఁ బరఁగువార

లాత్మభార్యారతు లన్యకామినుల నన్న
మాతృభావంబున మలఁగువారు
శాంతులు దాంతులు సత్సంగనిరతులు
పరసంపదల కాసపడనివారు

గీ. కలహ మెఱుఁగనివారును గలసి మెలసి
మెలఁగువారు నుదారు లమేయసుగుణ
రత్నరత్నాకరులు స్మితరమ్యముఖులు
నప్పురంబున నివసించునఖిలజనులు. 53

శా. జారుల్ చోరులు క్రూరకర్ములు దురాచారు ల్దురాసక్తులున్
భీరుల్ కూళలు కొండెగాండ్రు జనులం బీడించుమూర్ఖాత్ములున్
దారిద్ర్యంబునఁగుందువారు మదమాత్సర్యావిలస్వాంతులున్
నాకిజీవులు లేరు తత్పురమునన్ గాలించి శోధించినన్. 54

గీ. జూదరులు సోమరు లసత్యవాదరతులు
కపటచిత్తులు లంచముల్ గాంక్షసేయు
వారు పరులను నిందించువారు గాన
రారు తత్పురమం దుండువారిలోన. 55

సీ. సాంగవేదరహస్యసర్వస్వవిదు లైన
పారుల వేదనిస్వానములును
నఖిలగాంధర్వవిద్యావిశారదు లైన
గాయకోత్తంసులగానములును

వందిమాగధసూతవైతాళికాదుల
స్తోత్రపాఠంబులసుస్వరములు
ఝర్ఝరీడిండిమఝల్లరీనిస్సాణ
పణవగోముఖముఖ్యవాద్యములును

గీ. శారికాపికశుకముఖశకునరవము
కామినీజనభూషణక్వాణములును
సర్వజనకర్ణపర్వంబు సలుపుచుండ
నమరపురివలె నొప్పారు నప్పురమున. 56

ఆ. ఆహితాగ్ని గానియట్టివారుండును
గుండలములు లేనిపండితుఁడును
ఛాత్రశతము లేనిశాస్త్రిశిరోమణి
విప్రులందు లేఁడు వెదకిచూడ. 57

సీ. కదలుమేరువుపోలెఁ గనుపట్టుకింకిణీ
గణమణిమండితఘనరథములు
నష్టదిగ్గజముల నపహసింపఁగఁజాలు
శైలసన్నిభమత్తసామజములు
నుచ్చైశ్శ్రవముతోడ నుపమింపఁగాఁదగు
కాంభోజముఖ్యముల్ ఘనహయములు
నభ్రంకషంబులై యలరుమేఁపులతోడ
నొప్పారునత్యున్నతోష్ట్రములును

గీ. సకలచిత్రవిచిత్రప్రశస్త్రయంత్ర
ములును రిపుభీకరంబులౌ నలఘుశస్త్ర
రాజశతకోటి నేత్రపర్వంబుసేయు
రాణ రాజిలుచుండు నారాజధాని. 58

గీ. అలఘుసుమనస్సమాజము లలరుచుంట
విబుధసంఘంబు లెంతయు వెలయుచుంట
గురుసమంచిత మగుట నాపురవరంబు
శక్రపురమని చెప్పఁగాఁ, జనునుగాదె. 59

చ. అసదృశవైభవోన్నతి మహామహిమాంచితపౌరసంగతిన్
విశదయశోవిభూతి నిటు నిచ్చలు రాజిలుచుండునప్పురిన్
దశరథుఁ డేలుచుండుఁ దనధర్మగుణంబును బాహుశక్తియున్
లసదురు శేముషీగుణబలంబు లరాతులుగూడ మెచ్చఁగన్.

సీ. స్మృతికర్తయై లోకనుతిఁ గాంచి మించిన
మను వాది నేవంశమున జనించె
ధర్మపాలనకళాధారుఁడై నడిసన్న
మాంధాత యెందు సంభవమునందె
నేడుదీవుల నేకహేలఁ బాలించిన
యిక్ష్వాకురాజేంద్రుఁ డెందుఁ బుట్టె
రణధీరుఁడై జితారాతియై వెలసిన
రఘుమహారా జెందుఁ బ్రభవమందె

గీ. సత్యనైష్ఠికుఁ డాహరిశ్చంద్రుఁ డెందు
జననమొంది యశంబును సంతరించె
నట్టిరవివంశమందునఁ బుట్టి యఖిల
భూతలం బేలుదశరథుఁ బొగడఁ దరమె ? 6

గీ. అతఁడు దశదిశలందును నప్రతిహత
రథుఁడు గావుననే దశరథుఁ డటన్న
సార్థకాభిఖ్యఁ దాల్చి యాశక్రునకును
సాయ మొనరించి విపులయశంబుఁ గాంచె. 62

సీ. వీరుఁడై జలధిగంభీరుఁడై సుందరా
కారుఁడై మహితదోస్సారుఁ డగుచు
ధీరుఁడై విమతాతిదూరుఁడై సన్మతా
ధారుఁడై గుణగణోదారుఁ డగుచు
శూరుఁడై రుచిజితసూరుఁడై లసదలం
కారుఁడై హతశత్రువీరుఁ డగుచు
స్వైరుఁడై సంపత్కుబేరుఁడై సన్నుతా
చారుఁడై యర్థిమందారుఁ డగుచుఁ

గీ. పరమపావనభాస్కరవంశమందు
జననమందినభూపాలచంద్రులందుఁ
గలఁడె యీదృశధారుణీకాంతుఁ డనుచు
జనులు వినుతింప నొప్పె నాజనవరుండు. 63

సీ. హంసాన్వయాంభోధి కంబుజాతారియై
వేదవేదాంగాంతవిజ్ఞుఁ డగుచు
నతిరథశ్రేష్ఠుఁడై యరికుభృద్వజ్రియై
సంపద్విజితసురస్వామి యగుచు
యజ్వయై ఘనపుణ్య మార్జించి నిర్జిత
కాముఁడై లోకాభిరాముఁ డగుచు
సత్యప్రతిజ్ఞుఁడై సామంతశతమహా
రాజపూజితపదాంభోజుఁ డగుచుఁ

గీ. బ్రజల బిడ్డలఁబోలెఁ గాపాడి మూఁడు
లోకములఁ గీర్తివల్లికఁ బ్రాఁకఁజేసి
సతతతృప్తాత్మవృత్తి రాజర్షి యగుచు
నెగడుదశరథభూజానిఁ బొగడఁ దరమె? 64

మ. బలవద్భీముఁడు శత్రుసూదనుఁ డురుప్రజ్ఞాబలోపేతుఁ డ
త్యలఘుశ్రీయుతుఁ డప్రమత్తుఁడు సధర్మారంభుఁ డంచత్కృపా
కలితుండై నృపుఁ డేలుచుండుతఱి లోకంబెల్ల నిత్యోత్సవం
బులతోనొప్పెఁ దిరివిష్టపంబుపగిదింబూర్ణప్రమోదంబునన్.

ఉ. చారులఁ బంచి సత్యము నజస్ర మెఱుంగుచు శిష్టరక్షణో
దారత దుష్టశిక్షణవిధానసమర్థత నొప్పుతేనికిన్
ధీరులు సత్యసంధులు సుధీమణులౌ నెనమండ్రుమంత్రు లెం
తే రహిఁగూర్చుచుంట నఘ మేమియుఁ జొప్పడకుండె
[ధాగుణిన్. 66

గీ. అలజయంతుఁడు ధృష్టి సిద్ధార్థవిజయు
లర్థసాధకమంత్రిపాలాభిధాను
లయ్యశోకసుమంత్రు లత్యంతఘనులు
మంత్రులై కొల్వ నాతఁడు మహిమఁదనరె. 67

గీ. ఆగతానాగతార్థంబు లరయఁగలుగు
వారు పరమేష్ఠిమించిన వరవసిష్ఠ
వామదేవాదిమౌను లాపార్థివునకు
ఋత్విజులు వారిమాహాత్మ్య మెన్నఁదరమె ? 68

శా. నానాసజ్జనసన్నుతాసమమనోనైర్మల్య కౌసల్యయున్
మీనాక్షీమణియౌ సుమిత్రయును నమ్మీనాంకబాణంబనం
గా నొప్పారుమహావిలాసవతి కైకాదేవియున్ భార్యలై
రాణన్సేవలొనర్పఁగాఁదనరె నారాజేంద్రుఁ డెంతేనియున్.

ఉ. ఇట్టిమహావిభూతిఁ దన కెందు సమానులు లేరటంచు నె
ప్పట్టున నెల్లవారలును వాకొన లోకము నేలుచేనికిన్
బుట్టకపోయె నొక్కఁడును బుత్త్రుఁడు వంశమునిల్పుపొంకునిం
కెట్టులు కాల మాతనికి నేగు మనోవ్యథఁ జెందకుండఁగన్.

శా. నించెన్ నిర్మలకీర్తిచంద్రికలు క్షోణిన్, సత్కటాక్షంబు వ
ర్షించెన్ బీదలపైఁ బ్రసన్నతరదృష్టిన్ బంధుజాలంబు ర
క్షించెన్ దీనుల సత్కృపాకలనచేఁ జేయూతచే నెప్డుఁబో
షించెం బుత్త్రులఁ గూర్చుజన్నములుచేసెన్ భక్తిభావమ్మునన్.

గీ. అట్టి సత్కీర్తి నార్జించునట్టిపుణ్య
కార్యముల నెన్నొ చేసె దీక్షను వహించి
కాని యొక్కకుమారకు నైనఁగాంచ
కుంట నాతేఁడు శోకించుచుండు నెపుడు. 72

ఉ. ధారుణి సౌఖ్యజీవనము తప్పక కల్గును గాదె వంశవి
స్తారకుఁ డైనపుత్రుని ముదంబునఁగాంచెడువారి కంచునా
భూరమణుండు నిచ్చలు నపుత్రకుఁ డౌటను జింతసేయుఁదా
నారయ జన్మజన్మముల కందఁగ రాదని మోక్షసంపదల్.

చ. తనయులు గల్గి యుండినఁగదా వివిధాంబరరత్నహారచం
దనధనధాన్యరాజ్యవనితాగృహభాగ్యవిశేష మెంత యుం
డిన నది శోభఁజెందు ధరణీతలమందు నపుత్రకుండు, దా
మనియును లాభ మేమనుచు మాటికి నెంచు నృపాలుఁ
[డాత్మలోన్. 74

క. జగతిన్ దలఁప 'నపుత్ర
స్య గతి ర్నాస్తి' యనుచు బుధు లాడెడుమాటల్
తగునే? యసత్యము లనఁగ
వగచినఁ బాయంగఁబోవు పాత్రబ్ధంబుల్. 75

చ. అఱువదివేలవత్సరము లాయె ధరాభర మూని కేశముల్
నరసె జరాభరంబున బలంబును దగ్గెను బుద్ధిమాంద్యమున్
దొరకొనెఁ బుత్రులంగనమి దుర్భరఘోరవిషాదహేతువు
న్నరకము దాఁటు టెట్లని మనంబున నానృపుఁ డెంచు
నిచ్చలున్. 76

సీ. సంసారగంభీరసాగరాంభఃపూర
తారకోత్తముఁడు కుమారకుండు
భవకాననోద్భూత బహుళ బాధాభూజ
దారకోత్తముఁడు కుమారకుండు
వార్ధక్యదుర్దశావార్యాంధకారసం
హారకోత్తముఁడు కుమారకుండు
అఖిలైహికాముష్మికానందసముదయో
ద్ధారకోత్తముఁడు కుమారకుండు

గీ. అట్టిపుత్త్రునిఁ బడయమి వ్యర్థమయ్యె
నాదు జీవన; మేల యీనవ్యభర్మ
హర్మ్యరథగజతురగసైన్యాదివిభవ
మనుచు ననిశంబుఁ దలపోయు నానృపుండు. 77

సీ. ఎవఁడు పాలించునో యీయయోధ్యను భాస్క
రకులధరానాథరాజధాని
నెవఁ డధిష్ఠించునో యీగద్దె రవికుల
పార్థివపదరజఃపావనంబు
నెవఁడు ధరించునో యీకిరీటంబును
మనువంశనృపశిరోమండనంబు
నెవఁ డప్పళించునో యిమ్మహారాజ్యంబు
భానువంశనృపాలపాలితంబుఁ

గీ. బుత్రహీనుఁడనై నేను బుడమిఁ బాయ
నెవని బుత్త్విజు లౌదురో యింకమీఁద
నలవసిష్ఠుఁడు వామదేవాదిమౌను
లనుచు ననిశంబుఁ జింతించు నానృపుండు. 78

చ. ఇనకులమానవేశ్వరుల నేఁడును ము న్ననపత్యుఁ డన్నవా
ర్తను వినియుండ దానికి నిదర్శనమై తొలుఁదొల్త నేన ధా
రుణి జనియించినాఁడ నిఁక రూఢిగ నీయపకీర్తి నాశిరం
బున నె పడుంగదా యనుచుఁ బొక్కెడి నానృపుఁ డాత్మ
[నిచ్చలుక్. 79

ఉ. చేసితి రాజ్యపాలన వసిష్ఠముఖుల్ గడు సన్నుతింపగాఁ
జేసితిఁ బెక్కుజన్నములు జిష్ణుముఖామరు లెల్ల మెచ్చఁగాఁ
జేసితిఁ బెక్కుదానము లిసీ! యుదయింపఁడు బిడ్డఁ డొక్కఁడేఁ
జేసినపాపమేమొ యని చింతిలు నానృపుఁ డెల్లవేళలన్.80

చ.అనవధికాఘమేదొ యకృతాత్ముఁడ నే నొనరించియుండుటం
దనయులు గల్గకుండినను ధర్మము తప్పని పుణ్యమూర్తులై
మనినమదీయవంశజులమాయనిపున్నెము చేతనై ననున్
దనయులు పుట్టరాదెయని తాఁదలపోయు నృపుండుమాటికిన్

చ.కొడుకులు లేమిఁజిత్తమునఁగుందఁగనయ్యె; సమస్తసంపదల్
వడసియు లాభమేమి ? సుతలాభము నందినవారు సంపదల్
వడయకయున్న నేమి? సుఖవార్ధి మునుంగుచుఁ దేలుచుందురె
య్యెడ; నని యానృపుండు మది నెప్పుడుఁ జింతిలుచుండు
[ఖిన్నుఁడై. 72

గీ. బూదిఁ బోసినపన్నీరు మూదిరిగను
విపినమందునఁ గాచినవెన్నెలవలెఁ
గడలిఁ గలిపినకలకండకరణి వ్యర్థ
మయ్యె నాబ్రతుకాత్మజాప్రాప్తి నకట !

చ. అని యనిశంబు నాత్మజులకై వెతఁజెందు మనంబునందు ని
ద్రను గొనఁ డన్నముందినఁడు తక్కినభోగములందు లేశమున్
మనసును నిల్పఁడీవిధమునన్ నరనాథుఁడు నాఁడునాఁటికిన్
దనువు కృశింప ధైర్యరమ తగ్గ మునింగె విషాదవార్ధిధిన్.

గీ. చేయునది లేక ఱేఁ డిట్లు చివుకుచుండఁ
దండ్రికై వడి భూవరుఁ దలఁచునట్టి
పౌరు లెల్లరుఁగూడ విస్తారదుఃఖ
జలధి నిర్మగ్నమతులైరి సౌఖ్య ముడిగి.

క. పుర మెల్ల నిట్టి దుర్దశ
కిరవై క్షోభించుచుండు నెడ దశరథభూ
వరునకు దైవవశంబున
వరలెన్ హయమేధయాగవాంఛలు మదిలోన్. 86

ఉ. కోరిక లెట్టివైన సమకూర్చును జన్న మటంద్రు విజ్ఞు లేఁ
గోరినకోర్కి యేలసమకూడదొ చూచెద నశ్వమేధ మిం
పారఁగఁజేసెదన్ విబుధులందఱు మెచ్చఁగ నంచునెంచియా
భూరమణుం డమాత్యవరు బుద్ధిమదగ్రణిఁ గాంచి యిట్లనున్

ఉ. ఓయి సుమంత్ర! మంత్రివర! యుర్వర సర్వ మకంటకంబుగా
హాయిగ నేలునాకు నిసుమంతకొఱంతయు లేదుగాని నన్
బాయక యేర్చు నాత్మజుఁడు వంశమునిల్పఁగ నొక్కఁడైన లేఁ
డాయె నటన్నదుఃఖశిఖి యక్కట! నామరదృష్ట మెట్టిదో!

ఉ. చేసితి రాజ్యపాలనము శిష్టహితంబుగఁ బెక్కుజన్నము
ల్సేసితి నిర్జరావళులు శీర్షము లూపి నుతింప దానము
ల్సేసితి భూసురోత్తములలేములఁ బాపి సుఖింప నెన్నియో
చేసితిఁబుణ్యకార్యములఁ జెప్పఁగ నేటికి నీ వెఱుంగవే? 89

చ. ఎఱుఁగక యెన్నఁడేయఘము నే నొనరించితి నేమొ కాని నే
నెఱిఁగి యొనర్పలేదు లవమేనియుఁ బాపము నీభవంబునం
దరయక పూర్వజన్మములయం దొనరించినదోష మెట్టిదో
యెఱుఁగఁదరంబుగాదుగద యొంతటివారికి మంత్రిసత్తమా!

చ. అమలినబుద్ధి వేదముల నధ్యయనం బొనరించి బ్రహ్మచ
ర్యమున నమేయమౌ ఋషులయప్పును దీర్చితిఁ బెక్కుజన్నము
ల్క్రమముగఁ జేసి తీర్చుకొనఁగల్గితి వేల్పులయప్పు నెట్లొకో
కొమరులులేనినాకు నొడఁగూడుట మూఁడవయప్పుఁ దీర్పఁగన్

మ. తల నరసెన్ శరీరమున దార్ఢ్యము తగ్గెను దృష్టిమాంద్యము
న్గలిగెను దంతముల్గదలెఁ గాంతిదొఱంగె ముఖంబు పుత్రకుల్
గలుగుదు రింక నంట కిది కాలముగాదు దివాకరాన్వయం
బిలపయి నిల్చునెట్టు లిఁక నేమియొనర్తు నమాత్యశేఖరా!

చ. కొడుకులఁగాంచఁగోరి కడుఘోరముగా దురపిల్లునాకు నీ
యెడహయమేధమున్సలుప నెంతయువాంఛ ఫలించునేమొయం
చుడుగనియాస యొండు మది నుద్భవమందె నదే మొకాని, నా
నుడివినరీతిఁ జేసిన మనోరథముల్ ఫలియింపకుండునే ? 93

చ. స్థిరమతి నశ్వమేధమును జేసెదఁ బుత్రులఁగోరి యన్న మా
గురువరులౌ వసిష్ఠమునికుంజరులున్ మఱి యన్యులౌ మునీ
శ్వరులును దన్మఖం బొనరుపన్ సెలవిత్తురొ లేక నన్ను నే
తెరువునఁ బొమ్మటంచు నుపదేశ మొనర్తురొ చూడఁగావలెన్

ఉ. కావున నోయమాత్యవర! క్రిందుగ నేగి వసిష్ఠముఖ్యులన్
బావనమానితల్లజుల బ్రహ్మసమానుల నాప్రయత్నమున్
భావముఁ దెల్పి తోడుకొనివత్తువె మత్సభ కన్న నాతఁ డా
భూవరునాజ్ఞ నేగి మునిముఖ్యులఁ దోడ్కొనివచ్చెఁ జెచ్చెరన్.

సీ. సంజకెంజాయతో సఖ్యంబు వాటించు
కట్టుపుట్టంబులకాంతివారు
పిచ్చుకగూండ్లతో వియ్యమందుచు వ్రేలు
పొడవైనబిరుసుకెంజడలవారు
సకలలోకేశశాసనదక్షములౌ నాగ
డంబైనయోగదండములవారు
విశ్వజీవాధారపీయూషపూర్ణసిం
ధువులఁ బోలుకమండలువులవారు

సాంద్రచంద్రాతపశ్రీల సరసమూడు
భస్మదిగ్ధాంగసత్త్వభాపటలివార
లజుని కేన యైనయవ్వసిష్ఠాదిమునులు
వచ్చి కూర్చుండి రాసభాభవనమందు. 96

సీ. పాంచజన్యాదుల వర్జించి యిలకు వేం
చేసినహరి నా వసిష్ఠుఁ డొప్ప
ఫాలాంబకము డాచి వచ్చినయమ్మహా
దేవుఁడో యన వామదేవుఁ డలర
సృష్టి మానియు నేకశిర మూని వచ్చిన
యబ్జజుం డనఁగఁ గశ్యపుఁడు వెలయఁ
గరసహస్రము డాచి కడకు వచ్చినయంశు
మాలిపోలికను జాబాలి గ్రాలఁ

గీ. దక్కఁ గలసర్వమునిలోకతల్లజులును
దనువుఁ దాల్చినయట్టివేదములువోలె
రమ్యగతిఁ గనుపట్టునారాజసభకు
వచ్చె ముదమున దశరథావనివిభుండు. 97

గీ. వచ్చి కడుభక్తి ఋషులకు వందనములు
సేసి వారల నుతియించి సేమ మడిగి
ఫారిదీవన లంది యస్వార్థివుండు
వినయ మిగురొత్త వారితో ననియె నిట్లు. 98

సీ. ఎవ్వానిసంకల్ప మినచంద్రతారకా
దృఖిలసంభవమున కాదిహేతు
వెవ్వానిశుభదృష్టి యెల్లలోకంబుల
సతతంబుఁ బాలింపఁజాలియుండు
నెవ్వాఁడు కనుమూయ నీచరాచరవస్తు
సంచయం బెల్ల నాశనము నొందు
నెవ్వాని స్మరియింప నెట్టిపాపులకైన
సులభంబుగా మోక్షసుఖము గలుగు

గీ. నట్టిసర్వేశుఁ డెవ్వారియమలహృదయ
కమలకర్ణికలందునఁ గదలకుండు
నట్టిమిముఁ గనుగొంటి నాయఘములెల్లఁ
దొలఁగె ధన్యోఽస్మి నాపుణ్యములు ఫలించె. 99

గీ. కోటి యొసఁగిన భూపతికీటములకు
మిమ్ముఁ గనుభాగ్య మబ్బునే ? మేటితపము
కోటిభవముల మిముఁ గనఁగోరి నేను
చేసియున్నాఁడఁగాఁబోలు సిద్ధులార ! 100

ఉ. పావనమయ్యె నాతనువు పావనమయ్యెను నాదుచిత్తమున్
బావనమయ్యెనాగృహము పావనమయ్యెను నాదువంశమున్
బావనమయ్యె నాదువిభవంబు భవంబు భవత్పదాబ్జముల్
సేవలొనర్ప నాకు నిటఁజేకురె భాగ్య మిఁకేమికావలెన్ ?

మ. కరుణావార్ధులు శాంతచిత్తులు జగత్కల్యాణసంధాయకుల్
పరమోదారులు గానవచ్చితిరి నే ప్రార్థింపఁ గాకున్న చోఁ
దరమే యిందఱ బ్రహ్మకల్పుల నిటన్ దర్శింపఁగా నాకు, మీ
గురువాత్సల్యసుధాభిషేకమున నాకోర్కుల్ పిసాళించెడిన్.

చ. అమలసమాధియోగమున నక్షరు నీశ్వరు నంబుజాక్షు శ్రీ
కమలముఖీమనోహరునిఁ గన్గొనుచుం బనులెల్ల వీడి యా
శ్రమములఁ గాలమున్ గడుపుసంయమిచంద్రుల రైనమీకు నే
శ్రమమును గల్గఁజేసితిని సాహసవృత్తి క్షమింప వేఁడెదన్.

సీ. కన్ను లుండియు మేము కనఁజాల మేమియుఁ
గనులు విప్పకె చూడఁగలరు మీరు
వీను లుండియు మేము వినఁజాల మింత యా
కర్ణింపకయె వినఁగలరు మీరు
పదము లుండియు నొందుఁ గదలఁజాలము మేము
కదల కెందేనిఁ బోఁగలరు మీరు
చేతు లుండియు మేము సేయలే మెది; చేయ
కయె సర్వముం జేయఁగలరు మీరు

గీ. తెలిసియును మేము సుంతయుఁ దెలియలేము
కరతలామలకములు లోకములు మీకు
నట్టిమీబోంట్ల కింక నాయభిమతంబుఁ
జెప్పనేమిటి కైనను జెప్పువాఁడ. 104

మ. చతురంభోధిపరీతభూవలయరక్షాదక్షమై సజ్జన
స్తుతిపాత్రంబయి మీకృపాగరిమ నెందున్ లోటులేకుండ వి
స్తృతమై యొప్పినమాకులం బిపుడు విచ్ఛిన్నంబుగానున్న దే
గతి నీయాపద దాఁటవచ్చునో యెఱుంగన్జాల నావంతయున్.

సీ. గురుసేవఁ జేసి చేకొంటి విద్యల నెల్ల
సకలవిశ్రుతకళాశాలి నైతి
గౌరవించితి సర్వకవిపండితేంద్రులఁ
గొల్చియుంటిని దేవకోటి నెల్ల
నాచరించితిని మహాదానములు మహా
యాగంబు లెన్నో యత్యధికభక్తి
ననుభవించితిని మహాభోగముల మహా
సంగ్రామముల శత్రుజయముఁ గొంటిఁ

గీ. గొఱఁత లేకుండ సమకూరెఁ గోర్కు లెల్లఁ
దనయులను గాంచి మాజగద్బంధుకులము
నిలిపి పైతృకఋణవార్ధి నిస్తరించు
కోర్కి యొక్కఁడె నాకుఁ జేకూరదాయె. 106

క. తల నరసె నింకఁ గొమరులు
గలుగుదు రనునాసగూడఁ గడతేరెఁ గడున్
గలఁగెడుఁ జిత్తము; నాకొం
దల మేగతిఁ దీరు ? నెట్లుధన్యుఁడ నగుదున్ ? 107

మ. చిరకాలంబు కుమారలాభమునకై చింతింపఁ జింతింప నే
వెరవుందోపమి యట్టులుండఁగ మనఃపీడాభరం బెక్కుడై
మరణావస్థకు నన్ను నీడ్చునని యుస్మద్బుద్ధికిందోఁచు నె
క్కరణి న్దీరునో యీమనోవ్యథ యెఱుఁగంజాలన్గొంతయున్

క. ఐనను యజనంబున నే
దైనను సాధింపవచ్చు ననుబుద్ధిని నా
మానసమున నాశాలత
యీనాఁటికిఁ జావకుండ నెంతయుఁ బెరిగెన్. 109

క. అది కారణముగ నాకున్
మది హయమేధంబుఁజేయ మక్కువ యయ్యెన్
విదిత మగు సకలమును మీ
హృదయంబుల కెఱుఁగఁజెప్పరే ? యిది మేలే ? 110

క. అనవుడు మును లెల్లరు మే
లనఘా ! యేవాంఛలైన యజనంబున నా
ఘన మైనవాజిమేధము
నొనరించిన నీకుఁ బుత్త్రు లుదయింతు రనన్. 111

చ. దశరథుఁడాత్మ నెంతయుముదంబునుబొంది వసిష్ఠుఁజూచి "యో
వశివర ! సూర్యవంశనరపాలకదేశిక ! మాప్రతాపమున్
యశమును వైభవంబు భవదాజ్ఞ మెలంగుట నేకదా యహ
ర్నిశమును వృద్ధిఁజెందు నొనరింపఁగనాజ్ఞ యొవాజిమేధమున్?"

చ. అనుటయు నవ్వసిష్ఠముని హర్షమునొంది ధరాధినాథ!
విసయము నీనయంబును వివేకము ధర్మగుణానురక్తియున్
ఘనముగ సర్వసంపదలఁగల్గఁగఁజేయును వేగ యాగము
బొనరుపు మంత నాత్మజులు పుట్టుటతథ్య మటంచుఁబల్కుచున్

సీ. హయమేధ మొనరింప నావశ్యకము లైన
సంభారములనెల్లఁ జక్కఁ జెప్పి
స్థిరయోగదృష్టి నీక్షించి యాలోచించి
యుత్తమ మైనముహూర్త ముంచి
సరయూత్తరతటపవిత్ర స్తప్రదేశంబు
నందు శాలలఁ గట్ట నాజ్ఞయిచ్చి
అశ్వరాజము సమర్థాధిష్ఠితమును సో
పాధ్యాయమును విడువంగఁ జెప్పి

తే. దీక్షఁ గైకొన తేనికి నాక్షణమున
నాజ్ఞయిడి స్వాశ్రమంబున కరిగె నచటి
మునులు తోడనె చనుదేర ముదము మీర
నీశపదపద్మములు స్మరియించుకొనుచు. 114

క. అంతట భూకాంతుండును
నంతిపురంబునకుఁ బోయి యంగనలకు వృ
త్తాంత మఖిలంబుఁ దెల్పిన
నెంతయు సంతోషమంది రింతులు వెలుచన్. 115

గీ. కొంతవిశ్రాంతిఁ గైకొనఁ గోరి యపుడు
చలువ లెంతయు వెదఁజల్లుచంద్రశాలఁ
గువలయేశ్వరుఁ డొంటిగఁ గూరుచుండ
మంత్రిసత్తముఁ డైనసుమంత్రుఁ డరిగి. 116

ఉ. దేవర కొక్కసంగతిని దెల్పఁగవచ్చితి నాకు నిప్పుడే
దైవవశంబునన్ స్మృతికిఁదట్టిన దావిషయంబు విన్నచో
భూవర ! మీకు నెంతయును మోదముగల్గును విన్నవింతు నే
నావుడు ఱేఁడు తెల్పుమనినన్ ముదమంది సుమంత్రుఁడిట్లనున్

ఉ.మున్ను సనత్కుమారమునిముఖ్యుఁడు దేవయుగంబునందున
న్సన్నిధి నున్నసర్వమునిచంద్రములఁ గన్గొని యిట్లు పల్కె నో
సన్నుతశీలురార ! యొకసంగతిఁ గాఁగలదానిఁ దెల్పెదన్
దిన్నగ నాలకింపుఁ డిది దేవహితం బగుగాథ గావునన్.118

చ.కలఁడుగదా మహామహుఁడు కశ్యపుఁ డాతనికిన్ విభండకుం
డలరుఁగదాకుమారుఁడయి యాతనికిన్ సుతుఁడై జనింపఁగాఁ
గలఁ డలఋశ్యశృంగమునికాంతుఁ డతండును దండ్రితోడఁగా
నలనె చరించుచుండుఁ జలనంబు నెఱుంగక బ్రహ్మచారియై.

గీ. అంగదేశాధినాథుఁడై యలరుచుండు
రోమపాదాభిధానుఁడౌ భూమినేత
యపుడ యారాజు పొనరుచునఘమువలన
వాన లేకుండు నొకకొన్నివత్సరములు, 120

గీ. ఘోర మగునయ్యనావృష్టికారణమున
నంగరాజ్యమునన్ గఱ వధిక మగును
దానిఁ దొలఁగింపఁబూని భూజాని విప్ర
వరుల నెల్లర రప్పించి పలుకు నిట్లు. 121

ఉ. ఏమియఘం బొనర్చితినొ యే నొకయించుకయే నెఱుంగ నీ
క్షామము చాల ఘోరముగఁ జంపుచునున్నది నా ప్రజాళి? నే
నేమియొనర్తు? నెప్పగిది నీకఱ వాఱు వచింపరయ్య యో
భూమిసుపర్వులార! కడుపుణ్యము మీ కగు నన్న వారలున్.

గీ. యోగదృష్టి విలోకించి యొనరుపఁదగు
కార్యమును నిశ్చయించి భూకాంతుతోడ
నిట్లు వల్కుదు రోరాజ! ఋశ్యశృంగు
నెఱుఁగుదువె కా విభండకవరకుమారు? 123

ఉ. ఆతనిఁ దోడితెచ్చి భవదాత్మజ శాంతకుఁ బెండ్లిసేయు మో
భూతలనాథ! వర్షములు పొంపిరివోవును దేశమందు నీ
భీతి యడంగు నెల్లెడల వెక్కసమయ్యెడుఁ బాడిపంట లీ
రీతినిఁజేసినన్ సకలరీతుల శోభనముల్ పొసంగెడిన్. 124

ఉ. నావిని రోమపాదనరనాథుఁడు నేర్పున ఋశ్యశృంగునిన్
బావనమూర్తిఁ దోడుకొని వచ్చివివాహ మొనర్చు శాంతకున్
బోవును క్షామ మంతటను భూసురపుత్త్రుఁడు నాఁటినుండి శాం
తావనజాక్షిఁగూడి వసుధావరునింటనె యుండు హాయిగన్.

గీ. మఱియు నాకాలమునసనె ధర్మమున ధరణి
నేలు దశరథుఁ డనునంశుమాలివంశ
సంభవుఁడు వంశమును నిల్పుసత్సుతులను
గోరి హయమేధ మొనరించుఁ గోర్కెఁదగిలి. 126

చ. తనకును రోమపాదవసుధాపతికిన్ గడునెయ్యమాట నా
జనవరునింట నుండుమునిచంద్రము నుత్తము ఋశ్యశృంగునిం
గొని చని యశ్వమేధము నకుంఠితవైఖరి నిర్వహించు నా
ఘనునిఁ బురస్కరించుకొని కల్గుదు రాపయిఁ బుత్రు లాజికిన్

క. అని ముని సభ వివరింపఁగ
వినియుంటిని నేను గాన వేగిరపడ కా
ఘను ఋశ్యశృంగమునివరుఁ
గొనివచ్చినమీఁదఁ జేయఁగూడు మఖంబున్. 128

గీ. అని సుమంత్రుఁడు తెలుపంగ నవనిపతియు
ఘను వసిష్ఠునిఁ బిలిచి యాగాధ తెలిపి
యతని సమ్మతివడఁజేసి యంతిపురము
వారు మంత్రులు చతురంగబలము గొలువ. 129

చ. పురములుపల్లెలున్నదులుభూధరముల్గొలకుల్వనంబులున్
వరుసగ దారిలో నయనపర్వముగాఁగనుఁగొంచుఁ గొన్నివా
సరముల కంగదేశమును సంతసమొప్పఁగఁ జేరె నంగభూ
వరుఁడును నాజిరాక విని పౌర్ణిమ వార్ధిఢివోలెఁ బొంగుచున్.

గీ. గౌరవంబున నెదురేగి కౌఁగిలించి
తోడుకొనివచ్చి నెయ్యంబు తొంగలింప
సకలసౌఖ్యాకరము లైనసౌధములను
విడియఁగాఁజేసె. నాజిని వేడ్కమీఱ. 131

చ. ఘనుఁ డగురోమపాదనృపకాంతునిపీట మనోజ్ఞలీల నే
డెనిమిదినాళ్లు నిల్చి యపు డేర్పడఁ దా నట వచ్చియున్నయ
ప్పని నినవంశజుండు తెలుపన్ విని యంగనృపాలుఁ డంపె నా
జినృపునితోడ నల్లునిఁ బ్రసిద్ధచరిత్రుని ఋశ్యశృంగునిన్.

ఆ. సుతసతీసమేతు సువ్రతు నమ్మౌని
పుత్త్రుఁ గొంచు నాత్మపురముఁ జేరి
దశరథుండు వేడ్కఁ దళుకొత్త హయమేధ
యాగహయము గురునియాజ్ఞ విడిచె. 133

## గద్యము

ఇది శ్రీమత్పరదేవతాప్రసాద సమాసాదిత సరసకవితాపరాయణ వేద
వేదాంగవిజ్ఞాన పావనవాజపేయయాజికుల కలశయాదో
నాథతారానాథ రామనాథ వేంకటరమణపౌండరీక
మహాక్రతుయాజికుమార రామసుబ్బారాయ
వేంకటనారాయణకవికిశోర ప్రణీతం
బైన సీతాకల్యాణం బను
మహాప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము



శ్రీసత్పరదేవతాయై నమః

# సీతాకల్యాణము



## ద్వితీయాశ్వాసము



సీ. పరమపవిత్రుఁడై పరఁగుభాస్కరుపేర
నెవ్వానివంశంబు నివ్వటిల్లు
మనుహరిశ్చంద్రాదిమహనీయు లెవ్వాని
వంశమందు జనించి వాసినొంది
రజసమానుఁడు వసిష్ఠాభిఖ్యుఁడౌ ముని
కుంజరుం డెవ్వానికులగురుండు
బాహాబలప్రౌఢిఁ బాకారి కాహవ
స్థలమున నెవ్వాఁడు సాయమయ్యె

గీ. నజున కెవ్వాఁడు సుతుఁడయ్యె నట్టిపంక్తి
రథుఁడు వంశము నిల్పుపుత్త్రకులఁ గోరి
యశ్వమేధంబు నొనరించునంత తత్ప్ర
యత్నసంరంభ మేమని యభినుతింప ?

చ. చలనవిహీనవృత్తి సడిసన్న వసిష్ఠునియంతవానికే
చలనముగల్గెఁ దత్సవనసాధనసంచయసంగ్రహక్రియా
కలన మఱొక్కమానిసికిఁ గల్గకయుండునె? చెప్పనేల భూ
వలయమునందెకాక త్రిదివంబునఁగూడ జనించెహెచ్చుగన్

గీ. రాజచంద్రుండు యాగనిర్వహణభార
మెల్లఁ దనమూఁపునందున నిడినకతన
ఖరకరాన్వయరాజన్యపరమగురున
కొక్కక్షణమైనఁ దీఱిక చిక్కదయ్యె. 3

సీ. భాషించు నొకవేళ వాజిమేధముఁగూర్చి
జాబాలిముఖమునీశ్వరులతోడ
మాటాడు నొకవేళ మఖకర్మనిష్ఠిత
పండితబ్రాహ్మణవరులతోడ
నియమించు నొకవేళ నిఖిలకర్మాంతిక
ఖనకవర్ధకిశిల్పకరులతోడఁ
బ్రేరేచు నొకవేళ వివిధేతరక్రియా
నిపుణులఁ దమతమనేర్పుఁ జూప

గీ. శాలితండులగోధూమచణకమాష
యవతిలాఢకముద్గముఖ్యములు తేనె
ఘృతము చక్కెర మున్నగునితరవస్తు
వితతిఁ గూర్చువారల నొకవేళఁ బంచు. 4

ఉ. కన్నులపండువౌకరణిఁ గట్టఁగఁబంచెను యాగశాల నై
కోన్నతభూజపూర్ణసరయూత్తరతీరసమప్రదేశమం
దెన్నఁడు నట్టిదాని ధర నెందును జూడమటంచు నెల్లరున్
సన్నుతులంబొనర్చి స్మయసాగరమందున మున్గి తేలఁగన్.

క. ఆయాగశాలచుట్టును
నాయాగముఁ జూడవచ్చునందఱు విడియన్
జేయంగఁ దగినశాలల
వేయించెను వేనవేలు వేడుకఁగొలుపన్. 6

సీ. సకలసామంతరాజన్యులు విడియంగఁ
జాలసుందరములౌ శాల లొకట
వివిధదేశాగతవిప్రవిట్ఛూద్రులు
నివసింపఁగాఁ దగు నెలవు లొకట
నపరిమితంబైనయాగసంభారసం
చయ ముంచు భాండారచయము లొకటఁ
జూడవచ్చినవారి సొగయించునతిమనో
జ్ఞము లైనరత్నశాల లొకట

గీ. స్యందనాగారములు వాజిశాల లొకట
సామజాగారములు గోష్ఠచయము లొకటఁ
దీర్చి నిర్మింపఁగాఁ జేసె ధీబలంబు
మెఱయ నారవికులరాజగురువరుండు. 7

ఉ. మానగు చిత్రశాలలును మజ్జనభోజనమందిరంబులున్
జానగు రచ్చకొట్టములు సౌఖ్యదము ల్శయనాలయంబులు
గానవినోదధామములు కాంచనభూషణవస్త్రమాలికా
నూనసుగంధవస్తుసుమనోహరశాలలు గట్టి రచ్చటన్.

క. అందందు విశ్రమింపఁగ
సుందరవిలసత్సుగంధసుమనోవల్లీ
మందిరములు వేదికలును
వందలు వే లయ్యె యాగవాటముచుట్టున్. 9

ఉ. నేరుపుమీఱ నిట్లురమణీయముగా సకలంబుఁ దీర్చి యా
నీరజసంభవాభుఁడు మునిప్రవరుండు సుమంత్రుఁ జూచి యీ
ధారుణిఁ బిల్వనై నవసుధాసురభూవరవైశ్యశూద్రులన్
దీరుగఁ బిల్వనంపు మిట దిద్దితి సర్వము యుక్తవైఖరిన్. 10

ఉ. శాంతుని వేదవేది బహుశాస్త్రవిశారదు సత్యవాది దు
ర్దాంతపరాక్రమున్ దశరథప్రభుమిత్రవతంసు నిర్మల
స్వాంతు ననంతరమ్యగుణసాగరు మేరుసమున్ విదేహభూ
కాంతుని దాంతు నజ్జనకు గౌరవమొప్పఁగ నీవ పిల్వుమా.

ఉ. రాజపటీరతారకమరాళతుషారసుధాసరస్వతీ
రాజగిరీశకాశసురరాజమతంగజహీరజాహ్నవీ
రాజితకీర్తిశాలి నపరాజితవిక్రమవార్ధి వారణా
సీజనపాలు రాజహితు స్నిగ్ధునిఁ బిల్వఁగ నీవ యేగుమా.

చ. అరిబలసింధుమంథనగ మచ్ఛయశోవిభవుండు సద్గుణా
కరుఁడతిధార్మికుండు నృపకాంతుఁడు శాంతుఁడు వృద్ధుఁడున్న రే
శ్వరునకు మామ కేకయనృపాలుఁ డుదారుఁడు సత్యసంధుఁ డా
ఖరకర తేజుఁ బిల్చుటకు గౌరవమారఁగ నీవ యేగుమా.

చ. చిరసఖుఁ డాజికిన్ విమలశీలుఁడు కాలుఁడు వైరిసేనకున్
బరమదయావిభూషణుఁడు పావనమూర్తి విశుద్ధకీర్తి సు
స్థిరమతి యంగదేశపతి జిష్ణుసమానుఁడు రోమపాదుఁ డా
వరనృపుఁ బిల్వ నన్యులను బంపక నీవ స్వయంబ యేగుమా.

క. అన విని సుమంత్రుఁ డాగతి
జనకాదులఁ బిల్వఁ దాని చనుచున్ బరస
జ్జనులఁ బిలువంగ నితరుల
గుణవంతులఁ బంచె నీతికోవిదవరులన్. 15

ఉ. ఆవలఁ గొన్ని నాళ్ళ కఖిలాశలనుండియు బ్రాహ్మణోత్తముల్
భూవరశేఖరు ల్సుగుణపూజ్యులు వైశ్యకులాగ్రగణ్యులుం
బావనచిత్తపంకజులు పాదజులున్ ధర యీనెనో యనం
గా వడి రాఁదొడంగి రతిగాఢరతిన్ హయమేధవాటికిన్.

ఉ. కొందఱు స్యందనంబులను గొందఱు మత్తగజాళిమూఁపులం
గొందఱు వాజిరాజిపయిఁ గొందఱు లొట్టియలెక్కి బండ్లపైఁ
గొందఱు పల్లకీలపయిఁ గొందఱు కాల్నడఁ గొంద ఱీగతి
న్నందడిమీఱ రా నిసుము చల్లిన రాలద వీథివీథులన్. 17

ఉ. వందలు వేలు లక్షలు నవారిగఁ గోటు లనంతకోటులు౯
సుందరసుందరీమణులు సూరివరేణ్యులు సత్కవీశ్వరుల్
గ్రిందుగ వేదవేదులును గాయకసింహులు నన్యసత్కళా
స్పందులు వచ్చి రాసవనవైభవము౯ దిలకించుకోరిక౯

ఉ. ఎందఱు వచ్చిన౯ మునికులేశ్వరుఁ డందఱి కన్నిరూపులై
యొందును దానయైనగతి నెల్లర మిక్కిలి సత్కరించి యా
నందముగూర్చి నందఱు ఘనంబుగఁ దన్నుధరాధినాథుని౯
వందులకై వడి౯ నుతు లపారముగా నొనరించు నట్లుగ౯.

ఉ. కొందఱురత్నహారములఁగొందఱుకాంచనభూషణంబుల౯
గొందఱుమూల్యవస్త్రములఁగొందఱుమత్తమతంగజంబుల౯
గొందఱు వారువంబులను గొందఱు ధేనుశతంబుఁగ్రాన్న గా
నందఁగఁజేసి రాజికి మఖార్థము వచ్చినవారు ప్రీతితో౯. 20

గీ. ఇట్లు యాగంబుఁ జూడంగ నెల్లవారు
వచ్చునప్పటి కాయెను వత్సరంబు
మఖతురంగమరాజంబు మగిడి వచ్చె
నంతట లతాంతకాంతవసంత మాయె. 21

ఉ. సంతస మొప్పఁగాఁ బ్రకృతిసారసలోచన నవ్వె నాలతా
సంతతులు౯ సమస్తతరుసంచయముల్ కుసుమించి మించె న
త్కాంతపదాధరోష్ఠకరగండము లట్లు చివుళ్లు గ్రాలెఁ ద
త్కాంతలకీర్తి నొప్పె నళికోటి వసంతసమాగమంబునన్. 22

ఉ. ఆరమణీలలామయధరామృతమట్లు మరంద మొప్పె నా
సారసనేత్రిగాన మన శ్రావ్యముగా నలరారె శారికా
కీరపికాదిపక్షిగణగీతము లాసతిగుబ్బలో యనం
గారహిఁబుష్పగుచ్ఛములు గ్రాలె వసంతసమాగమంబునన్.

ఉ. ఆసతియంగరాగమున కౌననఁ బుష్పపొడియొప్పె నాపెమై
వాసనయో యనంగ సుమవాసన దిక్కుల ముంచెఁ దద్గతో
ల్లాసమువోలె సర్వజనులన్ దమిదీరఁగఁ బొందె నూతనో
ల్లాసము తన్మనోహరవిలాసము లెన్నఁగశక్య మేరికిన్? 24

గీ. అట్టిఋతువున నారంభమందె యాజి
ఋశ్యశృంగుఁడు మున్నగుఋషులతోడ
సతులతోడను సద్వరశాలఁ జొచ్చె
రమణ గురుక్షత్రశుభముహూర్తంబునందు. 25

ఉ. జ్ఞానసముద్రులున్ సకలశాస్త్రచయశ్రుతితత్త్వవేదులౌ
మానులు వాజిమేధమఖమర్మవిదగ్రిణులైన ఋత్విజుల్
మానవనాథయాగమున మంత్రములందునఁదంత్రమందు నెం
దేనియు నొక్కలోపమును నేర్పడకుండనొనర్చుచుండఁగన్.

చ. జరిగెఁ బ్రవర్గ్య మెంతయును శాస్త్రసముంచితరీతిగా ననం
తర ముచితంబుగా నుపసదంబును నయ్యె ముదంబుమీరభూ
వరుఁడును నమ్మఖంబుఁ గనవచ్చినయెల్లరుఁ జూచుచుండ ని
ర్జరగణము ల్దివంబునఁ గరంబుముదంబున నుబ్బియాడఁగన్.

గీ. జరిగెఁ బ్రాతస్సవనము శాస్త్రప్రకార
మైంద్రమును నల్లె దత్తమై యడరె సోమ
రాజనుతి యయ్యె శుక్రిహితక్రమము మీఱ
నట్లె మాధ్యందినసవన మయ్యె నంత. 28

క. జరిగెను సాయంసవనము
జరిగెన్ హోమంబులెల్ల శాస్త్రహితముగాఁ
గర మస్ఖలితంబులుగా
హరిదశ్వకులావనీశుయాగమునందున్. 29

గీ. ఆఱు మారేడుయూపంబు లాఱు చండ్రి
యూపములు నాఱు పాలాశయూపములును
బ్రకటగతి దేవదారుయూపములు రెండు
నొక్క శ్లేష్మాతకంబును నొనరఁజేసి. 30

గీ. పుష్పగంధాదులను వానిఁ బూజచేసి
కాంచనాలంకృతంబులుగా నొనర్చి
వస్త్రములఁ గట్టి యాగీయపశుగణంబు
త్రిశత మాయూపములకును బంధించి రంత. 31

సీ. విధివిహితంబుగా విశసించి రశ్వంబు
నికరంబు యాజకుల్ నేర్పుమీఱ
నంతటఁ గౌసల్య యాగీయహయమును
బుష్పగంధాదులఁ బూజ సేసి

మువ్వూరు వలగొని మూఁడుబంగరుసూదు
లామృతాశ్వశరీరమందు గ్రుచ్చి
స్థిరచిత్తమున దానిచెంగట నొకరాత్రి
యిసుమంతయేనియు నేవపడక

గీ. కడపె ధర్మార్థసిద్ధికిఁ గడక నంత
యాజకులు వాజివపఁ దీసి యాగమోక్త
పద్ధతిని బ్రిబ్బశాఖపై వండి వేడ్క
హోమ మొనరించి రెల్ల రోహో! యనంగ. 32

క. ఆవప హుతమగుచుండఁగ
భూవరుఁ డాహోమధూమమును మూర్కొనె నా
నావిధపాపచయంబును
బోవంగాఁ జిత్తశుద్ధి పొందుట కొఱకై. 33

సీ. హయమేధయాగంబునందు ముఖ్యంబులౌ
నరయంగ మొదటిమూఁ డహము లందుఁ
దొల్తటిదినము చతుష్టోమ మనఁబడు
నందు స్తోమములు నాల్గలరుచుండు
నుక్థ్యాభిధానమై యొప్పు రెండవదిన
మతిరాత్రి మగుఁ దృతీయాహ మట్లు
మూఁ డహంబులుఁ గడు మోదావహంబుగా
జరిగినవెనుక నాజనవరుండు

గీ. దక్షిణగఁ బరివృత్తి నుద్గాత కిచ్చె
హోతకిచ్చెను వావాత నొసర మహిషి
బ్రహ్మకు నొసంగె నల్లె యధ్వర్యునకు నొ
సంగె బాలాకలిని శాస్త్రసమ్మతముగ. 34

గీ. వారు నయ్యింతులకరముల్ భర్త లట్లు
పట్టుకొని రంత తేఁడును వారి కమిత
రత్నకాంచనరూప మాకృయ మొసంగి
కువలయేక్షణలను గయికొనియె మరల. 35

క. మఱియుఁ నరపతి యిటు లా
హరిమేధమఖంబు ముగిసినంతటఁ జేసెన్
బెరక్రతువు లెన్నియైనను
బరమోత్సాహమున నెల్లవారలుఁ బొగడన్. 36

సీ. సలిపె జ్యోతిష్టోమసవన మాయుష్టోమ
యాగంబుఁ గావించె నాదరమున
నతిరాత్రముల రెంటి నతిహర్షమునఁ జేసె
నభిజిత్సవముఁ బ్రీతి నాచరించె
విశ్వజిద్యాగంబు వేడుకఁ జేసె న
ప్తోర్యామస త్తతక్రవు నొనర్చె
సర్వసర్వంసహాచక్రంబు యాజకా
గ్రిణులకు దక్షిణగా నొసంగె

గీ. ప్రాగ్దిశావని హోతకుం బ్రాప్తమయ్యెఁ
బశ్చిమావని యధ్వర్యుభాగ్యమాయె
దక్షిణావని బ్రహ్మకు దక్కెఁ దక్కఁ
గలధరాభాగ మెల్ల నుద్గాత కబ్బె. 37

ఉ. వారు నుదారచిత్తులు తపస్వులు గావున నిట్లు వల్కి రో
వీరకులావతంస! పృథివీభర మూనఁగ నీకుఁదక్క నె
వ్వారికి శక్యమౌ జపతపంబుల నుండెడిమాకు నేటివ్యా
పారము రాజ్యపాలన; శుభంబగుఁ గైకొని నీవ యేలుమా.

చ. అనవుడు నాజి వారలకు హర్షమెసంగఁగ రత్నహారముల్
ఘనముగ గోగణంబులను గాంచనమున్ రజతంబు నిచ్చి కై
కొనియె ధరిత్రి వెండియు నకుంఠితమోదముతోడ వారు దీ
వనల నొసంగి రాజినరపాలునకున్ సుతలాభ మందఁగన్.

ఉ. యాగము మంత్రతంత్రములయందొక లోపము నందకుండ నీ
లాగున సర్వసమ్మదసలక్షణపద్ధతి నొటచే హవి
ర్భాగము లారగించుటకు వచ్చినదేవత లెల్లఁ దృప్తులై
భోగిశయాను నప్పరమపూరుషుఁ గన్గొని పల్కి రీగతిన్.

ఉ. దేవ! మహానుభావ! కడుఁదృప్తిగ యాగము సాగెఁ గాన నీ
భూవరమౌళి కీయఁదగుఁ బుత్త్రుల నయ్యది యట్టులుండ నా
రావణు లోకకంటకుని రాక్షసనాథునిఁ జంపుకార్యమున్
నీవ యొనర్పఁగావలయు నేర్పున మా కభయప్రదాతవై. 41

ఉ. బమ్మవరంబుచేఁ దనదుబాహుబలంబును సర్వసంపదల్
ముమ్మరమాటవాఁడుకడుమూర్ఖుఁడుఁగ్రూరుఁడునీచుఁడైమదాం
ధమ్మునఁ గన్నుఁగానక ఘనమ్ముగ నేర్చుచునున్నవాఁడు లో
కమ్ములనెల్ల వానిభుజగర్వ మడంపఁగ నర్హ మిత్తఱిన్. 42

గీ. మఱియు వాఁ డేరివలనను మడియఁ డొక్క
మానవునిచేతమాత్రమే మరణ మొందుఁ
గాన మమ్మును దశరథుఁ గరుణఁజూడ
నమ్మహారాజుసుతుఁడవై యవనియందు. 43

ఉ. పుట్టుము నిన్నుఁగూర్చి తపముఁబొనరించుచునున్నసీతఁ జే
పట్టుము గాధినందనుసవంబును గాచి తరంగమాలికిన్
గట్టుము సేతువున్ భువనకంటకుఁడౌ దశకంఠుశీర్షముల్
గొట్టుము నీదులోకమునకుఁ దయసేయు మనంతరంబునన్

క. అన విని దనుజాంతకుఁడును
మనుజాకృతిఁ బుట్ట నొప్పె మార్తాండకులం
బున; హర్షమంది రమరులు
ఘనముగ నాదేవదేవుకై కొలునకున్. 45

గీ. ఇట్టు లయ్యాజియాఁగ మాఋత్విజులకు
నమరులకుమాత్రమేగాక యాదరమునఁ
జూడవచ్చినయెల్లపూజ్యులకుఁ గూడ
నమితహర్షద మయ్యె యథార్థముగను. 46

సీ. వండి పోసినపిండివంటలరాసులు
కనకాచలంబులకరణిఁ గ్రాలఁ
గన్నులపండువై యన్నకూటంబులు
వెండికొండలువోలె వెలయుచుండ
నమరనదీప్రవాహమ్ములకైవడిఁ
బెరుగువాల్మ్రుఁగడల్ వెల్లివిరియ
మితి యెన్నఁగారానియితరవస్తుసమృద్ధి
యింద్రజాలభ్రాంతి నెసఁగఁజేయ

గీ. ధరణి నెందైన నిట్టిసంతర్పణములు
జరగునే యంచు నెల్ల రాశ్చర్యపడుచు
సన్నుతింపఁగ సాఁగె నాసవము తొల్లి
ధాత చేసినయశ్వమేధంబుపగిది. 47

సీ. కలదేమొ యీరాజుకరకంజమునను జిం
తామణి యని లోనఁ దలఁచువారు
కలదేమొ యక్కామగవి యీనృపునియింట
నంచు స్వాంతమ్ముల నెంచువారు
కలదొకో యక్కల్పకం బీప్రభునితోఁట
నంచు లోలో వితర్కించువారు
సిద్ధోత్తముండు వసిష్ఠుండు కల్పించె
నీసర్వమం చాత్మ నెంచువారు

గీ. నగుచుఁ జూపఱు దశరథు నహరహంబు
సన్నుతించుచు భోజనశయనమజ్జ
నాదులం దెంతొ సంతృప్తి నందుచుండ
వరలె నారాజహయమేధవైభవంబు. 48

సీ. సౌఖశాయనికులై సనుదెంచి యుచితోప
చారముల్ నేర్పున సలుపువారు
మజ్జనాదికములఁ బజ్జనె యుండి యే
మేమికోరినఁ జేతి కిచ్చువారు
నడుగకయే భోజనావసరముల మ
న్నించి భోజ్యముల వడ్డించువారు
సమయంబునకు వస్త్రసుమహారతాంబూల
చందనాదికము లొసంగువారు

గీ. చరణసంవాహనాదుల సలుపువారు
వీవనల్ గొని వలయుచో విసరువారు
వేనవేల్ సేవకులు మించి వెలయుచుండ
జరిగె నారాజహయమేధసవనమహము. 49

ఉ. భూరమణుండొసంగె బహుభూసురవర్యుల కగ్రహారముల్
హారిసువర్ణమండమణిహారములుం గనకాంబరంబులున్
వారణరాజధేనుహరివారములున్ ధనధాన్యగేహముల్
మీరిన వేడ్క నెల్లరును మిక్కిలిఁ దన్నుఁ బ్రశంససేయఁగన్.

గీ. అశ్వమేధమఖం బిట్టు లైనవెనక
ఋశ్యశృంగునియాజ్ఞ నరేశ్వరుండు
పుత్త్రికామేష్టిఁ గావించె మిత్రికులము
విలుపుకొడుకులఁ బడయువాంఛలు సెలంగ. 51

సీ. అందు విభండకనందనుం డొకహోమ
మొనరించినంత నాహోమకుండ
ముననుండి పాయసపూర్ణపాత్రిం బొందు
హస్తాంబుజంబులయందుఁ బూని
యొకపురుషోత్తముం డుదయించి నేను బ్రా
జాపత్యపూర్షుండ భూపవర్య !
యీపాయసమును నీయింతుల కిమ్ము వా
రలు దీనిఁ గ్రోలి గర్భములఁ దాల్చి

గీ. యతులబలవిక్రమాఢ్యుల సుతులఁ గాంచి
నీకు ముద మొనరింతురు నిక్క మనఁగ
హర్ష పర్యాకులేక్షణుఁ డగుచు ధరణి
ధవుఁడు పాయసపాత్రి మోదల గ్రహించి. 52

గీ. భక్తి ముమ్మారు వలగొని ప్రణతుఁడగుచు
నమ్మహాపూర్షుఁ డింక నేమనునో యనుచు
వినయమున నంజలిఘటించి వేచియుండ
నంత యంతర్హితుం డయ్యె నాఘనుండు. 53

మ. కలయో నిక్కువమోయటంచు ధరణీకాంతుండుసందేహ మ
గ్గలమై తోఁపఁగ నాత్మహస్తయుగళిన్ గన్పట్టునప్పాయసా
జ్యలపాత్రింబును బెక్కుసార్లు విచికిత్సంగాంక్ష నీక్షించి య
వ్వల నిక్కంబనినిశ్చయించుకొనిశుంభత్స్ఫూర్తియైపొంగుచున్.

ఉ. పంచియొసంగెఁ బాయసముఁ బత్నులకుందగురీతి వారు హ
ర్షించి భుజించినూత్నమగుచెల్వముఁగాంచికడుంగడుంబ్రకా
శించిరి వారిఁ గాంచి నృపసింహుఁడు, దక్కినయెల్లవారలున్
గాంచినహర్షముం దెలుపఁ గాంచనగర్భునకైన శక్యమే ?

ఆ. అద్భుతముగ నిట్లు హంసాన్వవాయభూ
వరుఁడు దేవదత్తపాయసమున
ధన్యుఁడైన వెనుకఁ దమతమనెలవుల
కరిగి రఖిలజనులు హర్ష మెసఁగ. 56

గీ. నరపతియు మంత్రులును నంతిపురమువారుఁ
బురమువారును దోడరా ముదముమీఱ
యాగశాల వీడుచు నయోధ్యాపురంబుఁ
జేరి సుఖమందె సురపురి జిష్ణుఁ డట్లు. 57

చ. కొలఁదిదినంబు లాజినృపకుంజరుఁ డట్లు మహాసుఖంబుగా
నెలతలఁగూడి నిత్యరమణీయవినోదవిలాసకేళికా
కలనఁ జెలంగుచుండ నలకాంతలచెక్కులు తెల్లనయ్యె రో
మలతలు నల్లనయ్యెఁ బెరిమన్ నడ లల్లన మెల్లనయ్యెఁ బో.

క. నలుపెక్కెఁ జూచుకంబులు
బలిసె వలగ్నములు రుచులవాంఛలు ప్రబలెన్
దళమయ్యె నూర్పు లక్షుల
నలసత జనియించె నెల్ల రావందపడన్. 59

క. ఆయంగనలు భుజించిన
పాయసగుణ మేమొకాని పాండిమ తోఁచెన్
గాయముల నంత నుదయం
బాయెను వేవిళ్ళు వారి కల్లన మఱియున్. 60

ఉ. అంతిపురంబునన్ మొదట నంతఁ బురంబున నంత దేశమం
దంతట సర్వభూవలయమందునఁ జెప్పికొనంగసాగి ర
త్యంతముదంబు నచ్చెరువునందుచు నెల్లరు హంసవంశభూ
కాంతునికామినీమణులు గర్భముఁ దాల్చిరటంచు నెంతయున్

. ఆవార్త విన్నదాదిగ
భూవరుఁ డాసతులగర్భములు వృద్ధిఁగనం
గా వివిధదేవపూజలఁ
గావించుచునుండె భద్రగతి ననుదినమున్. 62

. మన్నించు నొకవేళ మంత్రివర్యు సుమంత్రు
ధీనిధి యుచితోపదేశమునకు
నుతియించు నొకవేళ మితిమీఱి పుత్రికా
మేష్టిఁ జేయించినఋశ్యశృంగు

నగ్గించు నొకవేళ నతిహర్ష మేపార
హయమేధయాగమాహాత్మ్యగరిమ
స్తుతియించు నొకవేళఁ గ్రతువొనర్చెడిబుద్ధి
వరలఁజేసినయాత్మభాగ్యమహిమ

గీ. భూసురోత్తములకు ధేనుభూహిరణ్య
రజతవస్త్రాదిదానముల్ రహి నొనర్చ
నంగనలగర్భముల కెట్టిహాని కలుగ
కుండుసుస్థితిఁ గోరి యొక్కొక్కవేళ. 63

సీ. ఒకవేళఁ గౌసల్యయొద్ద సల్లాపంబు
లాడుచుఁ గూర్చుండు నతిముదమున
నొక్కవేళ సుమిత్రయొద్ద వీణాగాన
మును హాయిమీఱంగ వినుచునుండు
నొకవేళఁ గైకేయిరొద్దఁ దొల్లిఁటియుద్ధ
విషయంబులను బ్రీతి వినుచునుండు
నొకవేళ ముగ్గురి నొక్కచోఁ జేరిచి
యాహ్లాదమున నాటలాడుచుండు

గీ. గర్భవతు లైనకాంతలఁ గాంచినంత
మాటిమాటికి వింతగా మట్టుమీఱి
స్వాంతమునఁ బుట్టునుత్సాహబలమువలన
వృద్ధుఁ డయ్యును దశరథోర్వీవరుండు. 64

సీ. అశ్వమేధమహామఖానంతరం బొక్క
వర్ష మట్టులు కడు హర్ష మెసఁగఁ
జనినంతఁ గౌసల్య చైత్రమాసంబున
సితపక్షమున నెంతొ చెలువుమీఱ
నవమిఁ బునర్వసూనక్షత్రమందుఁ గ
ర్కటలగ్నమున రాముఁ గనియె దశమిఁ
గైకేయి భరతునిఁ గనియెను మీనల
గ్నమునఁ బుష్యమిఁ గౌతుకమ్ముమీఱ

గీ. నంత నాశ్రేషఁ గర్కటమందు నాఁడె
కనియె లక్ష్మణశత్రుఘ్నులను సుమిత్ర
సకలసురమానవులు చాల సంతసింప
మించి దశరథుహర్షంబు మిన్నుముట్ట. 65

ఉ. ఆసమయంబునన్ గురిసె హర్షముమీఱ లతాంతవృష్టి సం
తోసమెసంగఁగా సురలు దుందుభుల న్మొరయించి రచ్చరల్
భాసురరీతి నాడిరి చెలంగుచుఁ బాడిరి దేవగాయకుల్
భూసురకోటి కింపొదవ భూపతిచేసె ననేకదానముల్. 66

క. పురవాసు లెల్ల రత్తఱిఁ
బురమెల్ల నలంకరించి పొంగుచు నూత్నా
భరణవసనమాలాదుల
ధరియించిరి పండుగులను దాల్చెడిరీతిన్. 67

సీ. పురుడు సన్నంత భూవరుఁడు వసిష్ఠాది
మునులను బిలిపించి ముదముమీఱ
జాతకర్మంబును సలిపి కౌసల్యాత్మ
జునకు రాముం డనియును సుమిత్ర
కన్నసూనులకు లక్ష్మణుఁ డని శత్రుఘ్నుఁ
డనియును గైకేయియాత్మజునకు
భరతుం డనియు నామకరణంబు నొనరించె
నలవసిష్ఠమునీంద్రునాజ్ఞఁ జేసి

గీ. యన్నదానంబు నొనరించె నఖిలజనుల
కవనిసురులకు ధేనువుల్ హారులు కరులు
నగ్రహారంబులును రత్నహారములును
శతసహస్రంబు లొసఁగెను సంతసమున. 68

సీ. తాతకుఁ దాతయౌ దామోదరుం డొక్క
మానవేశ్వరునికుమారుఁ డయ్యె
మారునితండ్రియౌ మామనోహరుఁ డొక్క
మానినీమణికిఁ గుమారుఁ డయ్యె
వైకుంఠపురమున వసియించునాశ్రీని
వాసుఁ డయోధ్యానివాసి యయ్యెఁ
గలశాంబునిధిపై చికిలఁ దూఁగుహరి యొక్క
తూఁగుటుయ్యెలలోన నూఁగుచుండె

గీ. ననుచు సురలెల్ల సన్నుతు లగుచు నుండ
నాజిసుతుఁ డయి కౌసల్య కవతరించి
లీల సాకేతపురి భర్మడోలయందు
రాముఁడై యూఁగుచుండె నారాయణుండు. 69

సీ. విషరాశి విహరించువిభుఁడు నారాయణుఁ
డుగ్గుఁ దాగఁగ నేవమొంద నేల
విషధరాగ్రిణిమీఁద వేడ్కఁ బరుండువాఁ
డుగ్గుఁ దాగఁగ నేవమొంద నేల
విషరాశికన్యకావిభుఁడు జనార్దనుఁ
డుగ్గుఁ దాగఁగ నేవమొంద నేల
విషము భుజించినవృషకేతనునిసఖుఁ
డుగ్గుఁ దాగఁగ నేవమొంద నేల

గీ. యనుచు సురలెల్ల ముచ్చటలాడుచుండ
బలిమిఁ గౌసల్య రెండుచేతులను బట్టి
యుగ్గుపోయంగ నేడ్చుచు నొయ్య నొయ్య
నేవమునఁ దాగుచుండె రమేశ్వరుండు. 70

ఉ. మీనముగా జనించె నటుమీఁద నొకానొకకూర్మ మయ్యె నా
పైన వరాహమయ్యె నటుపై నరకేసరి యయ్యె వామనుం
డై నడయాడె రేణుకకు నాత్మజుఁ డయ్యెను నేఁటి కాజికిన్
సూనుఁడుగా జనించె మధుసూదనులీలల నెన్న శక్యమే ?

చ. అనుచు వసిష్ఠముఖ్యులు మహర్షులు దన్ను సమాధినిష్ఠులై
కనుఁగొని విస్మయంబునను గాఢముదంబున సన్నుతింపఁగా
దనుజవిరోధి రాముఁడయి తల్లికడ న్దనుదోయిఁ గుడ్చుచున్
దినదినవర్ధమానుఁడయి తేజరిలంగఁ దొడంగె నెంతయున్.

ఉ. తక్కినరాజపుత్రులును దల్లులు దాదులు నక్కజంపుఁబె
న్మక్కువఁ బెంచుచుండఁగఁ గ్రమంబుగనాసితపక్షచంద్రమున్
జక్కఁగఁబోలి వృద్ధిఁ గనసాగిరి భూవరుభాగధేయమున్
మిక్కిలి సన్నుతించి పుడమిం గలయెల్లరు సంతసింపఁగన్.

సీ. కొన్నాళ్లు కమ్మద్దుకుల్కు లల్లల్లనఁ
గూర్చుండసాగిరి కొమరుమిగుల
నటుమీఁదఁ గొన్నాళ్లు కటునిటు వడివడిఁ
బ్రాఁకసాగిరి మహాప్రమద మెసఁగ
నంతటఁ గొన్నాళ్లకానంద మొదవంగ
నడువసాగిరి తప్పటడుగు లిడుచు
నాపైనఁ గొన్నాళ్లకాహ్లాద మేపారఁ
బరువెత్తసాగిరి బహువిధములఁ

గీ. దల్లులను దాదులను గూడి దాగురింత
లాడిగాఁగలయాటల నాడసాగి
రక్షిపర్వం బొనర్చుచు నద్భుతముగఁ
బట్టశక్యంబుగాకుండ బాలకులను. 74

గీ. కుడుచునప్పుడు నటునిటు నడచునప్పు
డాడునప్పుడు నిద్రించునపుడుగూడ
భరతశత్రుఘ్ను లొక్కచో వరలుచుండ
రామలక్ష్మణు లొక్కచోఁ గ్రాలుచుంద్రు. 75

సీ. తల్లిదండ్రులకంటె దాదులకంటెను
ముందుగా మేల్కొనుచుందు రెపుడు
సమయంబునకు వచ్చి జలకమాడి యలంకృ
తులయి హాస్యంబుల సలుపుచుంద్రు
పిలిచినయంతనే బిరబిర నేతెంచి
ముదమున నాహారమును భుజింత్రు
గజ్జలందియలును ఘల్లుఘల్లనిమ్రోయ
నలయక యే మాటలాడుచుంద్రు

గీ. పలుకుపలుకునఁ దేనియ లొలుక ముద్దు
గులుకుపలుకుల నేవేళఁ బలుకుచుంద్రు
తల్లిదండ్రులయుల్లముల్ పల్లవింప
మందిరం బెల్ల నానందమయముగాఁగ. 76

ఉ. వారిమనోహరాకృతులు వారిసుధారస మూరుపల్కులున్
వారలమందహాసములు వారివిలాసవిహారవైఖరుల్
వారలయాటపాటలరువారము వారి కెగాక యన్యులా
వారికిఁగల్గ నేర్చునె? ధ్రువంబుగ బ్రహ్మయు నెన్న నేర్చునే?

గీ. భువనమోహనలీలలఁ బుత్రులహర
హంబు నభివృద్ధిఁ గనుచుండ నవనిజాని
వారి నుపనీతుల నొనర్చెఁ బ్రిమద మెసఁగ
నర్హకాలంబున వసిష్ఠునాజ్ఞఁ బూని. 78

గీ. సానపట్టినవజ్రాలచంద మొప్ప
నధికతేజస్సమన్వితు లగుచు వారు
వెలుఁగఁజొచ్చిరి వడుగులై వేదశాస్త్ర
ములఁ బఠించుచుండిరి గురుకులమునందు. 79

చ. నలువకు నుద్దియైనమునినాథుఁడు నేర్పన బోధసేయఁగా
నలుగురురాజపుత్రికులు నాలుగు వేదము లాయుశాస్త్రముల్
కళలు సమస్తముల్ సులువుగాఁ బఠియించిరి వారిధారణా
బల మది యెట్టిదో తెలుపఁ బంకజపీఠునకైన శక్యమే ? 80

చ. వయసునఁజిన్నలయ్యుఁగనువారలువిస్మయమందిమెచ్చఁగా
హయముల మత్తవారణరథాదుల నెక్కి మనోజవంబునన్
భయ మొకయింతలేక సులభంబుగ స్వారియొనర్ప నేర్చి ర
వ్యయజవసత్వశాలు లయి పార్థివనందను లేమనందగున్? 81

గీ. అఖిలరాజకుమారుల కభ్యసింపఁ
దగుధనుర్వేదమందును దండనీతి
నద్భుతం బగుప్రావీణ్య మబ్బె నాజి
సుతుల కతిబాల్యమందె యాశ్చోద్య మేమొ ! 82

సీ. రాముండు సకలాభిరాముండు జలధర
శ్యాముండు ముఖజితసోముఁ డగుచు
వీరుండు జలధిగంభీరుండు మంగళా
చారుండు కనకాద్రిధీరుఁ డగుచు
శాంతుండు నిర్మలస్వాంతుండు సుగుణని
శాంతుండు మునిమనఃకాంతుఁ డగుచు
శూరుండు సుందరాకారుండు వైరిదు
ర్వారుండు భక్తమందారుఁ డగుచు

గీ. నన్నివిధములఁ దమ్ములకన్న మిన్న
యగుచు సర్వజనస్తుతి కర్హుఁ డగుచు
జనకునకుఁ బ్రియతముఁడయి చాల వెలిఁగెఁ
జుక్కలందున శోభిల్లుసోముపగిది. 83

సీ. పురుషోత్తముం డయ్యు నరవరాత్మజురీతి
మించు నేర్పున నటియించువాఁడు
సర్వజ్ఞుఁ డయ్యును సకలధర్మంబుల
దేశికముఖమునఁ దెలియువాఁడు
సకలేశ్వరుం డయ్యు సామాన్యభంగి నీ
శ్వరపూజ లనిశంబు సలుపువాఁడు
విశ్వజగజ్జాలపిత యయ్యుఁ దల్లిదం
డ్రుల నిరతంబుఁ దాఁ గొలుచువాఁడు

గీ. అఖిలమునిమోక్షదాయకుఁ డయ్యు మునుల
వినయగౌరవ మెసఁగ సేవించువాఁడు
నగుచు ధర్మంబు నణుమాత్రమైన విడక
రాముఁ డత్యంతలోకాభిరాముఁ డయ్యె. 84

సీ. ఆది బ్రహ్మను గన్నయయ్యయేగద రాముఁ
డాతనిదైవత్య మడుగ నేల?
మున్ను మారునిఁ గన్నయన్నయేగద రాముఁ
డాతనిసౌందర్య మడుగ నేల?
విశ్వంభరుం డైనవెన్నుఁ డేగద రాముఁ
డతనిక్షమాగుణం బడుగ నేల?
నరమృగేంద్రుం డైనహరియేగదా రాముఁ
డతనిపరాక్రమం బడుగ నేల?

గీ. ఘను బలిఁ గెల్చినట్టిఁడుగాఁడె రాముఁ
డతనిబలసంపదనుగూర్చి యడుగ నేల?
కమలమగఁ డైనసుభగుండు కాఁడె రాముఁ
డతనిశుభలక్షణంబుల నడుగ నేల? 85

సీ. తెలిదామరలతోడఁ దులఁదూగి కారుణ్య
రస మొల్కుచుండు నేత్రములవాఁడు
కరికరోపమములై కడుబలిష్ఠంబులై
యొప్పు నాజానుబాహువులవాఁడు

లక్ష్మీనివాసమై లావణ్యరూపమై
కాంతివిశాలవక్షంబువాఁడు
సాంద్రమై తరళమై శరదిందుచంద్రికా
సమమైనమందహాసంబువాఁడు

గీ. మత్తసామజగమనసంపత్తివాఁడు
డంబు దళుకొత్తుకంబుకంఠంబువాఁడు
పిడికిట నడఁగుసింగంపుసడుమువాఁడు
నగుచు రాముండు మించె బాల్యంబునందు. 86

ఉ. చెక్కులుమించుటద్దములచెన్నును దన్నును మోవి యన్ననో
చక్కనిదొండపండు నగఁజాలును సంపెగమొగ్గయైన నా
ముక్కున కుద్దిగాదు నరమున్ గడుమున్గద నాభియంద మా
పిక్కలకున్ మొసళ్లు కడుభీతిలి డాగు జలాశయంబులన్.

క. వదనము చక్కఁదనంబుల
సదనం బగు మఱియు లచ్చిసదనం బగుఁ దు
మ్మెదలన్ బెదరించుఁ గురుల్
కదనం బొనరించు నంధకారముతోడన్. 88

క. పదములు కోకనదమ్ములు
త్రిదశౌఘమునీంద్రభక్తదీనార్తిదవాం
బుదములు కైవల్యధనా
స్పదములు సంస్తుత్యసర్వసంపత్ప్రదముల్. 89

క. నలువకు వేయిశిరంబుల
చిలువకు నెవ్వారికైనఁ జెప్పందరమే
తలక్రిం దైనను రాముని
చెలువము శతజన్మములకుఁ జీమంతైనన్. 90

గీ. చూడ వలనైన నెమ్మేనిసొబగె తెలుప
నలవిగాదన్నఁ జూడంగ వలనుగాని
రాముసుగుణగణంబు వర్ణనముసేయ
యత్నమొనరించుటయు వ్యర్థమగును గాదె ? 91

ఉ. ఆతనితమ్ము లైనభరతాదు లలౌకికసత్యవిక్రమో
పేతులు సర్వసన్నుతవివేకసమంచితసద్గుణాయుతా
న్వితులు రూపవైభవవినిర్జితకంతువసంతతారకా
నేతలు శత్రుజేతలు వినీతిపరీతులు ఖ్యాతు లెంతయున్. 92

ఉ. ఈలలి సద్గుణాకరు లహీనపరాక్రములై కుమారకుల్
నాలుగుసాగరంబులన నాలుగువేదములట్టు లెంతయున్
గ్రాలుచునుండ వారలకుఁ గ్రందుగఁ బెండ్లి యొనర్పఁ గోరి భూ
పాలకుఁ డొక్కనాఁడు తగుపంకజనేత్రల నిర్ణయింపఁగన్.

గీ. మంత్రులు పురోహితులును సామంతనృపులు
కులగురుండు వసిష్ఠుఁడు గూడి యున్న
నిండుసభలో సుధర్మ నాఖండలుండు
పోలె సింగంపుగద్దియ లీల నుండి. 94

గీ. హర్ష బాష్పంబు లక్షుల నలముకొనఁగ
గురుముఖంబును మంత్రిశేఖరు మొగంబుఁ
జూచి యల్లన నమృతంపుసోన లొలుక
వచనరచన లొనర్చుచుఁ బలికె నిట్లు. 95

ఉ. వేగమె రామముఖ్యులకుఁ బెండ్లి యొనర్పఁగ వాంఛ నామదిన్
బాగుగ నాఁటికొన్నయది పాయక కారణమే మొకాని యే
నాగరికంపుబాగరుల నాతనయుల్ వరియింప మెచ్చువా
రో గుణవార్ధులార! కృప యోజనసేసి వచింపఁగోరెదన్.

గీ. అనుచునున్నంతఁ బ్రతిహారి యరుగుదెంచి
దేవ! దేవరఁ జూడ గాధేయమౌని
వర్యు లరుదెంచియున్నారు ద్వారమందు
ననుచు నల్లన విన్నప మాచరించె. 97

క. అది విని భూవరుఁ డంతట
ముదమున గాధేయమౌనిముఖ్యునిఁ గొనిరా
ముదలయిడి తాను వడివడి
నెదురేగి నమస్కరించి యెంతయు భక్తిన్. 98

గీ. తోడుకొనివచ్చి మిగుల సంతోష మొదవ
నర్ఘ్యపాద్యంబు లిచ్చి యర్హాసనమునఁ
గూరుచుండఁగఁ జేయుచుఁ గుశల మడిగి
యమృత మొలికెడిపలుకుల ననియె నిట్లు. 99

గీ. పావనంబయ్యె మాసభాభవన మిప్పు
డపరసూర్యునివలె వెల్గునట్టిమీరు
కరుణ వేంచేసియుండుటఁ గౌతుకమున
నంతరంగంబు పొంగె మహానుభావ!

చ. కుశికకులాబ్ధిచంద్ర! మునికుంజర! గాధికుమార! చెప్పుమ
కుశలమె నీకు శిష్యజనకోటికి సేమమె యాశ్రమంబులోఁ
గుశలమె తక్కువారలకుఁ గోరిక లన్నియు సాగుచున్న
నిశిచరబాధ లేక ఠవణింతువె యాగసమాధియోగముల్

చ. సతము విధేయశిష్యు లురుశాస్త్రములన్పఠియించుచుందు
యతిథులకున్ సపర్యలు మహాత్మ! లభించునె? లోపమేమియు
వెతకిన లేక సౌఖ్యములు వృద్ధిగొనం గనుచుందువే? మహ
క్రతువు లనంతరాయములుగాఁ గొనసాఁగెడినే యథావిధిన్

చ. మునికులసార్వభౌమ! తలపోయ భవచ్చరణాబ్జధూళిచే
ననుపమభోగభాగ్యముల నంది కృతార్థుఁడ నైతి నేఁడు
జనియుఁ బవిత్రమయ్యె విలసత్ప్రతిభం గనినాఁడ నిష్ఠు
న్మనులసమాగమం బగునుబో కృతసుకృతు లైనవారికిఁ.

మ. అనఘంబై విమలంబునై నిఖిలమాన్యంబై పవిత్రంబునై
ఘనమై దుర్లభమై యొసంగెడుభవత్కంజాతపాదద్వయా
ర్చనభాగ్యంబును గాంచువారలకు సంప్రాప్తించు నోగాధిన
దన! నిక్కంబుగ నిందునందు సుఖసందర్భంబు లెంతేనియున్

ఉ. ధన్యుఁడనైతి నేఁడుగద; తావకదర్శనభాగ్య మెట్లు సా
మాన్యులకబ్బుఁబుణ్యమణుమాత్రమెసంగుటనేమొనాదుమా
లిన్యము పోవఁగంటి, సఫలీకృతజన్ముఁడనైతి నెంతయున్
మాన్యతఁగాంచఁగంటి,ననుమానములేదు తరించెగోత్రమున్.

ఉ. పావనమయ్యె మద్గృహము పావనమయ్యె మదంగమాత్రయం
బేవిధిఁజూచినం గొఱత యించుకయైనఁ గనంగరాదు నే
పావనుఁడైతి నాసుతులు పావనులైరి మఱేమి కావలెన్
భావనసచ్చరిత్ర! మునివల్లభ! పావనగాధిసంభవా!

స. సృష్టికిఁ బ్రతిసృష్టిఁజేయ శక్తుండవై
యలత్రిశంకుని దివి కంపినావు
సిద్ధాత్ముఁడైనవసిష్ఠునితోఁ బంత
గించి బ్రహ్మర్షివై మించినావు
బొంకించుమిషచేతఁ బూతహరిశ్చంద్రు
సత్యంబు లోకానఁ జాటినావు
ఘనతపోనిష్ఠచేఁ దనరారి సప్తర్షు
లందున మేటివై యలరినావు

గీ. అట్టినీశక్తి వర్ణింప నజునికైనఁ
దరము కాదన్న మాబోటినరుల కెట్లు
శక్యమా నట్టిమిముఁజూడఁ జాలుభాగ్య
మిప్పుడు గాంచితి నిందు స్వగృహమునందె. 107

ఉ. ఎట్టితపంబుఁ జేసితినొ యెట్టిజపంబు లొనర్చినాఁడనో
యెట్టివ్రతోగ్రనిష్ఠ ఫలమేర్పడఁ గంటినొ తొల్లిజన్మమం
దెట్టివిశేషదానముల నిచ్చితినో కద మిమ్మువంటివా
రిట్టుల నాగృహంబునలరించెడిభాగ్యము నాకుఁజేకురన్.

ఉ. ఏమని పల్కనేర్తును మునీశ్వర ! నీప్రతిభావిశేషముల్
నే మును వింటిఁ; గంట నిట నిన్ను యథాశ్రుత మిప్డుగంటి నీ
కేమి యొసంగినన్ ఋణ మొకింతయుఁదీరదు భక్తలోకర
క్షామణి వీవు నీ కొకరు సామ్యమువత్తురె ? గాధినందనా !

గీ. హేల జనుషాంధునకుఁ గల్గుదృష్టియట్లు
బహుతరదరిద్రునకు నబ్బుభాగ్యమట్లు
సమధికతృషార్తునకుఁ జిక్కునమృతమట్లు
గాదె మీరాక మా కిప్డు గాధిపుత్ర ! 110

గీ. ధర్మపత్నులయందు సంతాన మంది
నట్లు పుత్రవైవాహికంబందు హర్ష
మొసఁగున ట్లామె నోసంయమీంద్ర ! మాకు
భవదమోఘదర్శనభాగ్యవైభవంబు. 111

ఉ. చిత్రము మౌనిమౌళి! సరిచెప్పఁగ మీవలె నెవ్వఁడొందు స
త్క్షత్రియవంశమందుఁ దొలుతం బ్రభవించి, తపఃపవిత్రచా
రిత్రముతోడ బ్రహ్మఋషివృద్ధిఁగనెం దదనంతరంబు? లో
కత్రయకీర్తనీయ మగుఁగాదె భవన్మహిమంబు సంయమీ!

మ. నను ధన్యుం బొనరింపవచ్చితివొ యన్యం బెద్దియైనం బ్రయో
జన ముంటం జనుదెంచినావొ త్రిజగత్సంభావ్య! తెల్పంగదే
పని నిక్కంబుగఁ గల్గెనేని యిదె నాప్రాణంబు లర్పించియై
నను మీకోరికఁ దీర్చువాఁడ ననుమానం బేల చిత్తమ్మునన్.

చ. అతులతపఃప్రభావమున నంబుజసంభవు మీఱి సృష్టికిన్
బ్రతి యొనరించి పేర్వడసి భాసిలుమీరలు నన్నుఁ బోలుభూ
పతి నొకకార్యమున్ సలుపఁబంచిన వాఁ డది సేయకున్న దు
ర్గతిఁబడి నష్టకీర్తియయి భ్రష్టుఁడు గాఁడొకొ మౌనిచంద్రమా!

ఉ. చేయఁగలాఁడొ లేఁడొ యనిచిత్తమునం దిసుమంతయైన గా
ధేయ! విచారమొందకుము దేవర వీవని నమ్మియుంటి నా
ప్యాయముగా నొనర్తు ననఘా! భవదీప్సితకార్యమెల్ల ని
ష్ఠే యడుగందలంపుము వహింతు శిరంబున నీదునాజ్ఞలన్.

చ. అన విని కౌశికుండు శిర మల్లన నూఁచి దరస్మితంబుతో
ఘనుల వసిష్ఠముఖ్యమునికాంతులఁ గన్గొని యిట్లువల్కు నీ
జనవరుఁ డాత్రిశంకుసుతుసాటి నిజంబుగ సత్యసంధతన్
దినకరవంశపావనుఁడు దీర్పకయుండునె నాదుకోరికల్ ?

క. అని రాజుమొగముఁ గన్గొని
మునిరాజు వచించె నిట్లు ముమ్మాటికి నీ
వని బొంకనట్టివీరుఁడ
వనియేకద నిన్నుఁ జూడ నరుదెంచుటయున్. 117

క. పని యెట్టిదైనఁ దీర్చెద
ననియంటివి గానఁ జెప్పనగు నిఁక నావ
చ్చినపనిఁ జెప్పెద వినుమా
దినకరవంశాబ్ధిసోమ! తేజోధామా! 118

గీ. ఏ నొకానొకఫలసిద్ధి నెంచి యొక్క
యాగ మొనరించుచుండఁగ యాతుధాను
లతులమాయాబలాధికు లామఖంబుఁ
జెఱచుచున్నారు సారెకు వెఱపు లేక. 119

గీ. యాగవేదికయందు మాయాబలంబు
మెఱయ మాంసము రక్తముఁ గురియుచున్న
వారు; క్రతుదీక్ష నే నుంట వారిమీఁద
నాగ్రహింపఁగ రాదు నా కవనినాథ! 120

గీ. వారు రావణుబలగమువా రవార్య
బలులు మారీచుఁ డనియు సుబాహుఁ డనియు
నందు రారక్కసుల రణమందు వారిఁ
జంప శక్తుండు మీరామచంద్రుఁ డొకఁడె. 121

క. కావున నాజన్నంబును
గావఁగ నారక్కసులను ఖండించుటకుఁ
జేవ గలనీకుమారుని
నావెంటను బంపుమయ్య నరనాథ! వెసన్. 122

చ. అన విని గుండె ఝల్లన ధరాధిపుఁ డించుక మూర్ఛవోయి యా
క్షణమునఁ దేఱి కౌశికు మొగంబును దైన్యముతోడఁ జూచుచు
న్మునివర! యిట్టికోరికల మున్నెవరైన గోరియుండిరే
జనవరు లెవ్వరేనియును సమ్మతి నిట్టివి తీర్చియుండిరే? 123

చ. ననుఁ బరిహాసమాడుటకొ నా మనం బరయంగ నెంచియో
తనయుని వెంటఁ బంపుమని తద్దయు వింతగఁ గోరియుంటి; రే
మనఁగలవాఁడ మీ నుడి వినట్టి నిశాటుల ముట్ట నేనె యో
పనుగద, యర్భకుం డిఁక నపత్రప నెట్టుల వారి ముట్టెడిన్.

ఉ. ఎక్కడ ఘోరరాక్షసు లదెక్కడ రాముఁడు వారితో రణం
బెక్కడ? వారల న్గెలుచు టెక్కడ? యజ్ఞము పూర్తి నొందఁగా
నెక్కడ రక్షణంబు? కలవే యిటువంటి విచిత్రధర్మముల్?
చక్కఁ దలంప గాధినృపసంభవ! గాత్రము కంప మొందెడిన్.

గీ. వరుస నఱువది వేలసంవత్సరములు
పుత్రసంతానభాగ్యంబు పొందలేక
జపతపోవ్రతాదుల నెన్నొ సలిపి తుదకు
నల్వురఁ గుమారులను గాంచినాఁడ నేను. 126

గీ. అల్ల రాముండు పుత్రులయందు జ్యేష్ఠుఁ
డగుచు ధర్మప్రధానుఁడై యలరుకతన
లక్ష్మణభరతశత్రుఘ్నులయెడఁ గంటె
నతనియం దనురాగ మత్యంత మలరు. 127

ఉ. రాముఁడు చిన్నవాఁడు రణరంగమెఱుంగఁడు శస్త్రవిద్యలెం
దేమియు నేర్వఁబోవఁడు గ్రహింపఁగలేఁడు బలాబలంబులన్
రాముని( బాయునాకు నిఁక రాజ్యమదేటికి సౌఖ్యమేటి కే
నేమెయిఁజూచిన న్విడువ నిచ్చఁగింపదు రామభద్రునిన్.

చ. మునికులనాథ! నీమఖము పూర్తిగ నయ్యెడుదాఁక నేను నీ
యనుమతిఁదప్పకుండఁ జతురంగబలంబులఁగూడి వచ్చి యే
యనువునన్నైనఁ గాచెదను; నాత్మసుతున్ దయ నేలుమయ్య నా
మనవిని జిత్తగించి చనుమా వెనువెంటనె వత్తు నిప్పుడే ?

చ. అనుటయుఁగౌశికుండపుడు హంసకులాగ్రణి! మేలుమేలునీ
వనినటు లేము నిన్నుఁబరిహాసములాడుచుఁ గూరుచున్న నీ
మనముఁ బరీక్షఁజేసినను మా కొకలాభము గల్గనేర్చునే ?
పని మఱిలేదె మాకు నిటుపల్కుటధర్మమె మమ్ముబోంట్లతోన్.

చ. అలసట కోర్చి దవ్వనక యాశ్రమము న్విడనాడి కన్నన
న్నలఁ బరిచర్యలన్నియు నొనర్చెడిశిష్యుల వీడి శ్రీహరిన్
గొలుచుట మాని నీసభకుం జనుదెంచుట హాస్యభాషణం
బుల నిటు కాల మూరకయ పుచ్చుటకాచుఁ దలంచి పల్కితే?

క. ఎక్కడ మాయాశ్రమ మది
యెక్కడ మీరాజధాని యెంతభరం బీ
చొక్కటికి నడచి వచ్చుట
కక్కజ మగు నీకుమాట లాలింప నృపా! 132

క. ఇప్పుడె కద యే మడిగినఁ
దప్పక నే నిత్తునంటి దాతవు బలె నీ
గొప్పఁదన మింతమాత్రమె
తప్పించుకొనంగఁ జూచెదవె నేర్పు మెయిన్. 133

ఉ. కోరినకోర్కె లెల్ల సమకూర్తునటంచుఁ బ్రతిజ్ఞఁబట్టి నన్
గోరుమటంచుఁజెప్పితి వకుంఠితభక్తిని వెల్లడించి వి
స్తారపరాక్రమంబునయి సత్యము దప్పనిసూర్యవంశమం
దారయ నుద్భవించితి వటంచుఁదలంచితి నిన్ను భూవరా!

ఉ. కాని భవత్ప్రతిజ్ఞ క్షణకాలమె నిల్చునటం చెఱుంగుచో
దానముసేయుదాతవలెదబ్బరమాటలు వల్కనిన్నిటుల్
నేను కరంబుసాచి ధరణీధవ ! యాచనసేయ వత్తునే
ప్రాణముపోయినన్ నియమపద్ధతిఁబాయుదురే ధరావరుల్ ?

ఉ. నీవలనన్ జనించె నపనింద కళంక మనంగ నెట్టిదో
భూవలయంబునం దెఱుఁగఁబోని ప్రభాకరవంశమందు, ధా
త్రీవర! చాలుఁజాలు భవదీయచరిత్రము చిత్రమాయె నిం
దావహమైనజీవితము నందుటకన్నను నైచ్య ముందునే ?

ఉ. నీకొరు లేలచెప్పవలె నీతిని నెన్నఁడుఁబాయనట్టియి
క్ష్వాకుకులప్రదీపకుఁడవై మనినాఁడ వటన్నకీర్తి నిన్
జేకొన సత్యమార్గమున జీవితశేషము వెళ్ళఁబుచ్చుచున్
నీకులశీలధర్మములు నిల్పుమ ధర్మపథానువర్తివై. 137

చ. రవికులసార్వభౌమ ! వినరాదుగదా భవదీయవంశజుల్
ప్రవిమలనీతిధర్మములఁ బాసినరాజవరేణ్యులంచు నా
రవికుల మంతకున్ దగనిరట్టు భవత్పరిపాలనంబునన్
దవిలె నటంచు నిన్నిదిమొదల్ జనులెల్లరుఁ దిట్టకుందురే!

చ. మనుకులసంభవుండ వసమప్రధితప్రతిభాఢ్యుఁడౌ వసి
ష్ఠునకు విధేయశిష్యుఁడవు చోద్యముగాదె వివేకశాలివై
మనుజవరేణ్య! నీ వనినమాటను దప్పుట? యింతకంటె హె
చ్చునఁదగుపాపమున్నె?నిరయంబునఁగూల్ప దెతత్ఫలంబు నిన్!

సీ. అన్నదానాదిమహాకార్యఫల మొక్క-
యనృతభాషణముతో నణఁగిపోవు
జపతపోనిష్ఠాదిసత్కృత్యఫల మొక్క-
యనృతభాషణముతో నణఁగిపోవు
చిరకాలతీర్థసంసేవనఫల మొక్క-
యనృతభాషణముతో నణఁగిపోవు
దానధర్మక్రియాతాత్పర్యఫల మొక్క-
యనృతభాషణముతో నణఁగిపోవు

గీ. అశ్వమేధమహాక్రతు వైన నరయ
సత్యవాక్యంబుతో నెట్లు సాటియగును ?
గానఁ గీర్తి నార్జించుభూజాని వైన
నాడి తప్పంగనేల ? యీనాఁడు నీవు ? 140

ఉ. ప్రాజ్యవిభూతిచేత వినరానియసత్యపువాక్కు లాడుచున్
బూజ్యతఁగాంచినట్టి మునిపుంగవులన్నఁ దిరస్కరించి సా
మ్రాజ్యమదమ్మునం దిరుగుమానవనాథుల కింక నెట్లు సా
యుజ్యముగల్గు?సత్యగుణ మోర్వనివారి కధోగతుల్సుమీ.

చ. అనృతము లాడువారి కనఘా! చిరకీర్తి యణంగిపోవదే?
దినకరవంశజుండవయి తెంపున నాడినమాటఁ దప్పవ
చ్చునె? మనువంశసంభవులు శుద్ధచరిత్రు లటన్నకీర్తికిన్
ఘనమగురూపుసూపెదవో, కాదనిదానినిరూపుమాపెదో!

ఉ. బొంకినఁబాపముబ్బుఁగలపుణ్యము వాయునుమాయుఁగీర్తియు
న్బొంకన నెట్టిదో యెఱుఁగఁబోనిమహాత్ములజీవితంబునన్
వంక యొకింతగల్గునె? శుభస్థితి కల్గదె యిందునందునన్?
బొంకెద వేల? సూర్యకులభూషణ! సత్యగుణప్రపోషణా!

మ. అనృతం బాడెడివారికంటెఁ గలరా? యత్యంతపాపాత్ములో
జననాథా! యలసత్యసంధుని హరిశ్చంద్రున్ బ్రతిష్ఠించు నీ
యినవంశమ్మున నింత కేర్పడఁ డొకం డేనిన్ మృషావాది; ని
న్నెనయుంబో యిఁక నామహాపయశ మోయీ సుంత
[ యోజింపుమా. 144

ఉ. ఆయినవంశభూధవుని నాజిని నాదిని గౌశికుండు నా
ప్యాయముతోడఁ జూడఁజనినంతటఁ గోరినకోర్కు లిత్తునం
చాయతభక్తితోఁ బలికెఁ;నంతట రాముని బంపఁగోరఁగా
నీయఁగలే దటంచు జను లెల్లరుఁ బ్రువ్వఁగనిన్నుఁదిట్టరే?

గీ. అలహరిశ్చంద్రుఁ డేవంశమందుఁ బుట్టె
నందె నీవును బుట్టితి వైన నేమి ?
ఆతనికి, నీకు సుగుణోదయంబునందు
హ స్తిమశకాంతరంబు, వాదాడ నేల ? 146

గీ. హంసకులజులయందున నాజి యొకఁడె
యాడితప్పించుకొనఁగల్గినట్టిబుద్ధి
శాలి యనివెడికీర్తి యాచంద్రతార
కముగ నిల్చును బొమ్మ భూకాంతమాళి ! 147

మ. అనుచున్ దిగ్గనలేచిపోవుటకునై యత్నింపఁగా నాజి య
మ్మునిపాదంబులవ్రాలియిట్లనియెనోపుణ్యాత్మ!మీయాగ్రహం
బున కే నెంతటివాఁడ నావలనఁ దప్పు ల్గల్గె మన్నింపుఁ డే
మనమా రాముఁడశక్తుఁడెంతయునుమీయాగంబురక్షింపఁగన్

గీ. తెలివిమాలినవాఁడ నాబలముకొలఁది
నెఱుఁగఁజాల కేమడిగిన నిత్తు నంటి
నన్నమాత్రంబునకె రాము నడుగఁదగునె?
యడుగ నీకున్న నాగ్రహమందఁ దగునె? 149

ఉ. ఇచ్చెదనంటిఁ గానఁ దమ కిచ్చెద వేఱొకఁ డెద్దియైన నో
సచ్చరితాగ్రగణ్య! మునిచంద్రమ! కోరుఁడు దేనియందుమీ
కిచ్ఛజనించు నయ్యదియ యిచ్చెద రాజ్యముఁ బ్రాణమైన నే
నిచ్చెదఁగాని కొనుండుననునిప్పటికిన్ క్షమియింపుఁడెంతయున్.

చ. తనయులఁ గోరి యేఁబడినతాపముదైవమెఱుంగు; నెట్లొయా
పనట యడంగె నేఁటి కొకభంగి సుఖంబుగ నుంటి మీరునా
తనయుని ఘోరరాక్షసులఁ దాఁకఁగఁ బంపుమటన్నఁ జంపుకొ
మ్మనుటయకాదె యట్లులననౌనె?మహాత్మ!దయాపయోనిధీ!

గీ. బాలుఁ డకృతాస్త్రుఁ డెన్నఁడుఁ బ్రధనమన్న
మాట వినినైన నుండఁ డేమాడ్కిఁ బోర
నేర్చు నెటులైన నన్ను మన్నింపవలయుఁ
దనయుగతి నన్నుఁ జూడుఁడీ మునికులేశ! 152

గీ. అనుచుఁ బదములఁ బడి చాల వనరువాని
వేడికన్నీరు కార్చుచు వేఁడువాని
నాథరాజానిఁ గని వాని యాగ్రహంబు
మాని దయఁబూని పలికె నిమ్మాడ్కి నపుడు. 153

గీ. నీకుమారునితత్త్వంబు నీ వెఱుంగ
వతఁడు సామాన్యబాలకుం డనుచుఁ దలఁచు
చున్నవాఁడవు తండ్రివై యున్నకతన
నెట్లు బోధింపవలయునో యెఱుఁగఁజాల. 154

గీ. రామభద్రునిసత్యపరాక్రమంబు
తన్మహత్త్వంబు నాకును దాపసోత్త
ములకును వసిష్ఠగురుమునిపుంగవునకుఁ
గాక యేరికిన్ దెలియ శక్యంబు గాదు. 155

ఉ. సూనుఁడు చిన్నవాఁడనుచు శూరులఁదాఁకెడుశక్తిగాంచఁగా
లేనికుమారుఁడంచు రణలీల నెఱుంగనివాఁ డటంచు నీ
మానసమందుసందియముమానుమురాముఁడుదేవతుల్యుఁడో
మానవనాథ! నమ్ము మనుమానముమానుము మానసమ్మునన్.

ఉ. రాముఁడు ఘోరపాతకవిరాముఁడు కోటిదివాకరప్రభా
ధాముఁడు క్రూరరాక్షసవితానవిదారణదక్షదోర్బలో
ద్దాముఁడు సర్వరాజసుతతారకసోముఁ డవార్యశౌర్యసు
త్రాముఁడు పార్వతీశముఖదైవతసన్నుతనాముఁ డారయన్.

ఉ. కావున నీదురాజ్య మవిఖండయశోవిభవాభిరామమై
దేవత లెల్లరుం బొగడు తేజము గాంచఁగఁ గాంక్షయున్నచో
నావెనువెంట నిర్భయమనమ్మున ధైర్యనిధానమూర్తివై
నీవరపుత్రునిన్ విమలనీతిగుణాఢ్యుని రాముఁ బంపుమా.

క. నాపని నెఱవేర్పఁగఁ బరు
లోపరు నీకొడుకు రాముఁ డొక్కఁడె యోపున్
దాపముఁ జెందక పంపుము
నాపలుకులు విశ్వసించినన్ శుభము లగున్. 159

క. మీరాముబలము విక్రమ
మీరాముఁడు పల్కుపల్కు లెట్టివొ యెఱుఁగన్
నేరరు పరులు వసిష్ఠుం
డారయఁగలఁ డడిగిచూడు మాఘనునైనన్. 160

క. అన విని వసిష్ఠముని రా
మునితత్త్వ మెఱుఁగు యోగిపుంగవుఁ డౌటన్
జనవరునితోడ నిట్లని
యెను మందస్మితముసేసి యెల్లరు వినఁగన్. 161

గీ. కౌశికునిమాట వేదవాక్యంబు రామ
భద్రుఁ డసహాయశూరుండు బాలుఁడయ్యు
రక్కసులనెల్లఁ ద్రుటిలోన నుక్కడంచుఁ
బంపనగుఁ గౌశికునితోడ భద్రమగును. 162

చ. అన విని రాముఁ బంపుటకు నాజి ముదంబున సమ్మతించె దో
డనె సనుదెంచి మౌనినికటంబున నిల్చెను రామచంద్రుఁ డా
తని విడలేక నీడవలెఁ దమ్ముఁడు లక్ష్మణుఁడు ప్రయాణమై
మునివరువెంట నేగుటకు మోదమునం జనుదెంచె నంతటన్.

గీ. మునికరంబులందు ముదమునఁ గొడుకుల
కరము లుంచి దైవఘటన మెంచి
కలుగుఁగాక మీకుఁ గల్యాణములు పోయి
రం డటంచుఁ బంపె రాజు సుతుల. 164

గద్యము

ఇది శ్రీమత్పరదేవతాప్రసాద సమాసాదిత సరసకవితాపరాయణ వేద
వేదాంగవిజ్ఞాన పావనవాజపేయయాజికుల కలశయాదో
నాథతారానాథ రామనాథ వేంకటరమణపౌండరీక
మహాక్రతుయాజికుమార రామసుబ్బారాయ
వేంకటనారాయణకవికిశోర ప్రణీతం
బైన సీతాకల్యాణంబను
మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము

శ్రీమత్పరదేవతాయై నమః

# సీతాకల్యాణము



## తృతీయాశ్వాసము



చ. స్మరహరు వెంబడించిచనుస్కందగజాస్యులపోల్కి బ్రహ్మతో
నరిగెడు నశ్వినీతనయులట్లు మునీశ్వరు వెంట జంట నా
నరవరపుత్రు లేగునెడ నాట్యమొనర్చిరి నిర్జరాంగనల్
మొరసెను దేవదుందుభులు పుష్పసువృష్టి యొసంగె నంతటన్.

మ. అనుకూలంబుగవీచె వాయువులయోధ్యావాసులారాజనం
దనులం జూడఁగ మేడలెక్కి యమితానందంబునన్ వారిపైఁ
జను చోఁ జల్లిరి పూవు లక్షతలు లాజల్ మంచిపన్నీరునున్
గన నింపయ్యెఁ బురంబునల్లడల శృంగారంబు పొంగారఁగన్.

గీ. ఇట్లు పౌరల కుత్సాహ మినుమడింపఁ
బౌరు లెల్లరుఁ గర ముత్సవం బొనర్ప
సంతసంబునఁ జూచుచు సంయమీంద్రు
వెంటఁ బురమును దాఁటి భూవిభునిసుతులు.

మ. సరయూదక్షిణతీరమార్గమున వృక్షచ్ఛాయలన్ హాయిగాఁ
దరువల్లీసుమవాసనాభరితమందస్పర్శనాంకూరముల్
తరచై ఘర్మమువాయ వీవఁగ శకుంతవ్రాతగీతధ్వనుల్
కర మానందకరంబు గా వినుచు నేగన్ సాగి రంచద్గతిన్.

గీ. మానమును బూని వడివడి మాని సార్ధ
యోజనం బేగి యంతట నొక్కచోట
సాగి రామునితో నిట్లు లనియె రామ
చంద్ర! పూతుఁడవై చేత జలముఁ గొనుమ. 5

క. కొను మివె బలాతిబల లను
ఘనవిద్యలు వీని నీవు గ్రహియించిన, డ
ప్పినిఁ గొన వాఁకలి నొందవు
జనియింపదు నీకు నెట్టిశ్రమ మెయ్యెడలన్. 6

చ. కలుగవురోగముల్నిదురఁగాంచినయప్పుడుగూడసోఁకుమూఁ
కలభయ ముండ దెల్లపుడు గల్గు శుభంబులు కీర్తి గల్గు ని
శ్చల మగుజ్ఞాన మబ్బు నరిసంఘవిదారణబాహుశక్తియున్
గలుగు ననంతసౌఖ్యములు గల్గుఁ దొలంగు నరిష్టజాలముల్.

గీ. చూడ దక్షప్రజాపతిసుతలు వీని
ఘోరతపము నొనర్చి కైకొంటిఁ దొల్లి
దశరథాత్మజ! కైకొనఁ దగినవాఁడ
వౌట నుపదేశ మొనరింతు నయ్య! నీకు.

గీ. అనుచు నావిద్యల నొసంగి హర్ష మెసఁగ
రామలక్ష్మణసహితుఁడై రాజమౌని
యందె యారేయి తృణశయ్యలంగుఁ బుచ్చి
బయలుదేరెను మరలఁ బ్రభాతమందు. 9

గీ. కొంతద వ్వేగి సాయ మానంత వార
లల్లనల్లన నొకసుందరాశ్రమంబుఁ
జేరి రంతట నాగి కౌశికుఁడు రామ
లక్ష్మణులఁ జూచి యిట్లు పల్కఁగసాగె. 10

మ. కనుఁ డిచ్చోటనె గంగఁ గూడు సరయూకల్లోలినీరత్న; మీ
మునివాటంబు నదీద్వయంబు నడుమన్బొల్పారు; నీయాశ్రమం
బున నే పూర్వము కృత్తివాసుఁడు తపంబుం జేసె; నిచ్చోట నే
తనువుం బాసియనంగుఁ డయ్యెమును గందర్పుండు దర్పంబఱన్

గీ. ఇంక మరుఁ డంగములఁ బాసినందువలన
నంగదేశంబు నాఁబడె నయ్య! యిద్ది
పాడిపంటల కిక్కయై పరిఢవిల్లు
నఖిలసంపత్సమృద్ధితో నలరుచుండు. 12

గీ. అరయ భీమాశ్రమంబుఁ గామాశ్రమంబు
ననఁగ సొంపారునట్టియీయాశ్రమమునఁ
దప మొనర్చెడిమునులు మాధవుని శిష్యు
లతిపవిత్రులు బ్రహ్మకీడైనవారు. 13

చ. అనివచియించుచుండఁగఁ దదాశ్రమవాసులు మౌనిశేఖరు
ల్ఘనులు నృపాలపుత్రకులఁ గౌశికుఁ జూడఁగ నేగుదెంచి ప్రా
ర్థన మొనరించి రచ్చటనె రాత్రి వసింపఁగ ; వల్లెయంచు న
మ్మునివరుఁ డాత్రియామనటఁ బుచ్చె నృపాలకుమారయుక్తుఁడై

క. వఱువాత లేచి వారలు
సురకల్లోలవతి దాఁటి సురుచిరగతి నే
గిరి దక్షిణతటమునఁ గల
తరువల్లీతతుల సమ్మదంబునఁ గనుచున్. 15

చ. చనిచని సూర్యుఁ డస్తగిరిఁ జయ్యనఁ గ్రుంకెడువేళయందు ని
ర్జనమును దుర్గమంబు మదసామజకాసరదంతిభిన్నమౌ గా
దనముఖజంతుభీకరము తాలతమాలకపిత్థపాటలా
ర్జుననిబిడంబునౌ వనముఁ జొచ్చిరి వా రురుధైర్యధుర్యులై.

క. ఆవనవృత్తాంతంబును
భూవరపుత్రులకు మౌనిపుంగవుఁ డురుమే
ధావిభవ మొప్ప నిట్లని
తా వచియించెను ముదంబు దైవారంగన్. 17

గీ. తొల్లి యనిమేషనేత వృత్రుని వధింప
నాతనికి నంటె బ్రహ్మహత్యాఘ మందు
వలనఁ గాయాశమలములు గలిగె మేన
బాధపడె నాతఁ డెంతయు వానివలన. 18

సీ. కలిగినకారూశములబాధ వారింప
నిర్జరావళియు మునిప్రవరులుఁ
గలశంబులను గొని గంగాజలముఁ బోసి
యిచట స్నానంబుసేయించి రింద్రుఁ
దొలఁగెను గారూశములపీడ యిచ్చోట
నది కారణంబుగ హర్ష మంది
వర మొసంగెను బురందరుఁ డీప్రదేశము
లకుఁ బాడిపంట లొద్దికను గలుగ

గీ. నాఁటినుండియు మలదముల్ నాఁ గరూశ
ము లన వన్నెకు నెక్కి శోభిలుచునుండె
నీప్రదేశంబు లిద్ధర నెందు లేని
పాఁడికిని బాటలకు నాటపట్టు లగుచు. 19

గీ. కాని తాటక యనెడురాకాసి యొకతె
కొన్నివత్సరములనుండి క్రూరవృత్తిఁ
దెరువు లరికట్టి మిగుల నీదేశములను
బాధవెట్టుచు నున్నది బహువిధముల. 20

ఉ. ఎక్కడలేనిసంపదల కిక్కలు లెక్కకు మీఱుపల్లెలన్
జక్కనిపట్టణంబులను జాలమనోజ్ఞములై సతంబు నా
జక్కులఱేనితోఁటలకు సాటిగ నుండినయీస్థలంబు నా
రక్కసిపీడ కోర్వక యరణ్యము లయ్యెను నేఁటి కీగతిన్.

గీ. వేయిగజములబలమున వెలయుదాని
ఘోరరూపంబుఁ గనినంత గుండె లవియు
నెట్టిధీరులకైనఁ; నాయింతిఁ జంప
వలయు నిప్పుడు మీరు మీబలము మెఱయ. 22

గీ. అతివఁ జంపుట పాపంబె యగును గాని
యిట్టిక్రూరనిశాటినిఁ బట్టి చంపు
టెంతొపుణ్యప్రదంబగుకృత్య మరయ
సౌఖ్య మగు దీనిచే సర్వజనులకవని. 23

క. ఈరక్కసికొడుకేసుఁడి
మారీచుం డనెడివాఁడు మన్మఖమునఁ గా
క్రూరుండై యంతరాయము
సారెకు నొనరించుచుండు సాహసికుండై. 24

చ. అన విని రామచంద్రుఁడు వనాంతరజంతుశకుంతసంతతుల్
ఘనముగ దద్దరిల్ల గిరికందరసీమలు మాఱుమ్రోయఁగా
వనధులు ఘూర్ణిలంగ దిగిభంబులు కంపమునొందఁగా ధను
ర్గుణనినదంబొనర్చె మునికుంజరుఁ డెంతయు మేలుమేలనన్.

గీ. ప్రళయకాలకరాళపర్జన్యగర్జ
కొజ్జయై కాంచనకశిపు నుక్కడంచు
నాఁటినరసింహహుంకృతి గీటడంచు
నమ్మహాదారుణధ్వని నాలకించి. 26

ఉ. కాటుకకొండఁబోలుఘనకాయము పాఱలఁబోలుదంతముల్
చేటలఁబోలుగోళ్లుఁ బెనుచీపురుకట్టను బోలుజుట్టు నా
రాటపుఁజూపు శైలకుహరంబును మీఱెడినోరు గల్గు నా
తాటక యేగుదెంచి బెడిదంబుగ హుంకృతులాచరించుచున్

చ. పటపటఁ బండ్లుగీటుచు నభం బగలం గడుబొబ్బరించుచున్
బటుతరకోపభారమునఁ బైఁబడ బారలు సాచుచున్ రజః
పటలము రేచుచున్ గహనపావకగోళకరాళనేత్రయై
గుటుకున రామలక్ష్మణుల ఘోరగతిం గబళింప డాసినన్.

చ. చిఱునగ వొప్ప దాశరథి చివ్వన శింజిని టంగుటంగనన్
మొరయఁగఁజేయుచుం గనకపుంఖశిలీముఖసంచయంబులన్
ఖరకరదుర్నిరీక్ష్యకరకాండసదృక్షములన్ ఘనంబుగాఁ
గురిసిన నన్నిశాటియును గొండొకదూరము పాఱి మాయమై.

గీ. ఘనశిలావృష్టి రామలక్ష్మణుల పైని
కాంతుఁ గప్పిన రాముం డొకింతయలుక
నవిరళామోఘశరవృష్టి నడరఁజేసి
దానిచేతులు ఖండించె దారుణముగ. 30

గీ. దానఁ గ్రోధంబు ద్విగుణీకృతంబుగాఁగ
రామచంద్రుని మ్రింగ నుగ్రముగ వచ్చు
తాటకను గాంచి సౌమిత్రి తరుణ మెఱిఁగి
ముక్కుచెవులను ఖండించె నక్కజముగ. 31

ఆ. అంత నన్నిశాటి యారాజపుత్రుల
యెదుట నిలిచి పోర బెదరి యసుర
మాయఁజేసి వారి మాయింప నెంచి య
దృశ్యయై యూచుఁ బోరఁదివిరె మిగుల. 32

గీ. కామరూపిణి గావున క్షణమున కొక
యాకృతినిఁ దాల్చి యెంతయు భీకరముగఁ
బాంసుపాషాణచయవృష్టిఁ బరపుదాని
పొగరుఁ గని భూరికోపంబు పొంగి పొరలి. 33

గీ. ప్రళయపర్జన్యగర్జను బరిహసించు
సింహనాదంబుఁ గావించి శితశరముల
సూటిగా దానియురమున నాఁటి రాముఁ
డవనిఁ గూల్చెను దాటక నద్భుతముగ. 34

గీ. అఖిలమాయాకృతుల వీడి యాత్మరూప
మును ధరించి ధరాధర మనఁగ భూమిఁ
జచ్చి పడియున్నయారక్కసను ముదంబుఁ
గదురఁ గని రాముఁ గొనియాడెఁ గౌశికుండు. 35

చ. అలఘుబలంబుఁ గ్రౌర్యము సహంకృతిఁబూని యనేకవత్సరం
బులు నరకోటి ధేనుగణము న్మదమారఁగ మెక్కి మెక్కి య
మ్మలదకరూశదేశముల మాపినరక్కసిదేహ మవ్విపిన్
గలబహుజంతుకోటి కుతుకమ్మున మెక్కెను వెక్కసంబుగన్,

గీ. ఇంద్రముఖసర్వనిర్జరు లేగుదెంచి
రాము నధికాదరంబునఁ బ్రస్తుతించి
మునికులోత్తముఁ డౌకౌశికునకు మ్రొక్కి
యంజలిఘటించి ప్రార్థించి రంత నిట్లు. 37

క. సురసుజనహితముగా ని
ర్జరవైరులఁ జంప ధరణి జన్మించినయా
హరియే యీరాముఁడు ముని
వర ! వేఱుగ మీకుఁ జెప్పవలయునె దానిన్ ? 38

గీ. ఐన మిము వేఁడుకొందు మోయనఘ ! మీరు
ఘోరతపము నొనర్చి కైకొనినయస్త్ర
రాజములనెల్ల నొసఁగుఁడు రామచంద్రు
నకు శుభం బగు నెల్లవారికి ధరిత్రి. 39

గీ. ఇట్లు ప్రార్థించి నిర్జరు లేగ మౌని
రామలక్ష్మణసహితుఁడై రాత్రి యచట
నుండి మఱునాఁడు రాముని కొసఁగెఁ బ్రేమ
నఖిలదివ్యాస్త్రముల నాతఁ డవి గ్రహించె. 40

చ. మునివరునాజ్ఞ నొదలను బూని ముదమ్మున వానినెల్లఁ ద
మ్మునకు నొసంగె నావెనుక ముప్పురు నవ్వని వీడి యవ్విరో
చనుఁ డపరాద్రిఁ జేరుతటిఁ జక్కఁగఁ జేరిరి కౌశికాశ్రమం
బును శుకముఖ్యపక్షిగసమూహమనోహరగీతపూర్ణముఁగా.

గీ. వారిఁ గాంచి తదాశ్రమవాసు లైన
మౌను లెల్లరుఁ గౌశికమౌనిమఖము
జరుగు నిర్విఘ్నముగ నింక శాస్త్రవిహిత
పద్ధతి నటంచు సంతోషభరితు లగుచు. 42

గీ. రామచంద్రుండు తాటక రణమునందుఁ
జంపె ననువార్త వినియుంట సన్నుతింప
సాగి రాతనిబలమును శౌర్యగరిమ
సత్యవిక్రమమును గుణసంపదలను. 43

గీ. కౌశికుండును స్వాశ్రమకథయుఁ దాను
సలుపఁబూనినయధ్వరచరిత మంత
రామలక్ష్మణులకుఁ జెప్పి రాత్రి చనఁగఁ
దెల్లవారినయంతట నుల్లసమున. 44

గీ. ఎల్లవారికిఁ గర్తవ్య మెఱుఁగఁజేసి
రామలక్ష్మణులను యాగరక్షణమున
నప్రమత్తత నుండఁగా నాజ్ఞ యిచ్చి
మౌనమును దాల్చి దొరకొనె మఖ మొనర్ప. 45

క. శరచాపకరులు రిపుభీ
కరులు ధరావరునిసుతులు కడుశ్రద్ధ మునీ
శ్వరుఁ గావ నైదుదినములు
జరిగె మఖం బెల్లమునులు సంతోషపడన్. 46

గీ. కాని కడపటినాఁడు రక్కసులమూఁక
వచ్చి మఖవేది నెత్తురువాన గురిసి
సవన మపవిత్రముం జేయసాగునంత
రామభద్రుండు లయకాలభీముపగిది.

గీ. ఉగ్రుఁడై కిన్క మారీచునురము వగుల
మానవాస్త్రంబు నేసిన వాని నూఱు
యోజనంబులు గొంపోయి యుదధిలోనఁ
బాఱవైచెఁ దదస్త్రంబు భయదలీల.

సీ. పిదప రాముఁడు శత్రుభీకర మయినయా
గ్నేయాస్త్రమును బ్రయోగింప నదియు
వక్షఃకవాటంబు వ్రచ్చి సుబాహుని
యమనిలయంబున కనిపె నంతఁ
దక్కినరక్కసుల్ తమదండనాయకుల్
ధరణిఁగూలుటఁ జూచి ధైర్య మేఁది
కలగుండువడుచుండఁ గాంచి రాముండు వా
యవ్యాస్త్రమున వారి హతులఁ జేసె

గీ. నంత నిర్విఘ్నముగ సాగె నధ్వరంబు
గాఢహర్షంబు నొందెను గౌశికుండు
రామలక్ష్మణోదగ్రపరాక్రమమ్ముఁ
బొగడి రాశ్రమవాసులౌ మునులు మిగుల.

ఉ. అమ్మఱునాఁడు భానుఁ డుదయాచలమందు వెలుంగుచుండఁగా
ల్యమ్ములనెల్లఁ దీర్చికొని యాజిసుతుల్ దరహాససుందరా
స్యమ్ములతోడఁ గౌశికునిసన్నిధి నిల్చి మహానుభావ! కా
ర్యమ్మిఁక మే మొనర్పఁదగునట్టిది తెల్పుమటన్న నాతఁడున్.

గీ. పలికె నిట్టులు మీబాహుబలమువలన
ధరణి సిద్ధాశ్రమం బనఁ దనరుచున్న
యట్టియీయాశ్రమంబు సార్థాభిధాన
మయ్యె నేఁటికి; సంతోషమయ్యె నాకు. 51

చ. జనకనృపాలమౌళి యొకజన్నము సేయుచునున్నవాఁడు దా
నినిఁ గనువేడ్క నెల్లరు మునిప్రవరు లనుచున్నవారు నే
నును జన నిశ్చయించితి మనోహరమున్ ఘనపుణ్యకారణం
బును నగునమ్మఖంబుఁ గనఁ బోవుదమే యన రాజపుత్రులున్.

ఉ. పోవుదమేయటంచు మునిపుంగవ! మమ్ముఁగంగనేల మీ
రేవిధి నాజ్ఞయిత్తు రటు లేగుద మేము; భవత్పదద్వయీ
సేవలొనర్చి శ్రేయములఁ జెందుటకేకద వచ్చియుంటి మా
భూవరునధ్వరంబునకుఁ బోవుటకన్నను భాగ్యముండునే?

చ. అనవుడు గాధినందనుఁడు హర్షముమీఱ వచించె నిట్టు లా
జనకునియింటఁ గల్గు శివచాప మొకం; డది యెక్కువెట్ట నే
ఘనునకుఁగూడఁ జెల్లదఁట, కన్గొనవచ్చును దానిచేవ యా
జనకునివీటి కేగు నెడ జన్నముఁ జూచుట యట్టులుండఁగన్.

క. అన విని రాజకుమారులు
జనకనరేశ్వరుపురంబు జన్నంబుఁ ద్రిలో
చనధనువుఁ జూచు టెన్నఁడొ
యని యువ్విళులూరసాగి రత్యధికముగన్. 55

గీ. కౌశికుండును జనకుయాగంబుఁ జూచు
వేడ్క సిద్ధాశ్రమంబున వెలయుమునులు
రాజపుత్రులుఁ దనవెంటరా ముదంబు
వరల మిథిలాపురికిఁ బోవ బయలుదేరి. 56

గీ. నాఁటిమధ్యాహ్నమునకు శోణాతటమున
వెలయు నొకరమ్యవనమున విడిసి కాల్య
ములను దీరిచికొని సుఖమ్ముగ భుజించి
కొంతవడి విశ్రమించి రాకొమరు లడుగ. 57

ఉ. తీయనిపల్కులన్ మగధదేశచరిత్రము దానితోడనే
పాయకవచ్చునాత్మకులపార్థివసచ్చరితంబుఁ దెల్పి యా
ప్యాయమొనర్చె వారి కటు లాదిన శేషము నందె పుచ్చియా
రేయి గతింపఁ బూర్వశిఖరిన్ హరిదశ్వుఁడు వెల్గుచుండఁగన్

ఆ. మరల బయలుదేరి మధ్యాహ్నమునకు వా
రమరసింధుతటమునందు వెలయు
నట్టియొక్కసుందరారామమును జేరి
విశ్రమించియుండువేళ వేడ్క. 59

సీ. సగరుండు హయమేధసవనంబుఁ జేయుట
యింద్రుఁ డాహరి హరియించుటయును
గపిలునికోపాగ్నికతమున సగరభూ
వరునికుమారులు భస్మమగుట
వారి స్వర్గమునకుఁ బంపఁగోరి భగీర
థుఁడు తపంబు నొనర్చ దొరకొనుటయు
గంగావతరణప్రకరణంబు సగరుని
పుత్త్రులు స్వర్లోకమునకుఁ జనుట

గీ. మున్ను గాఁగలకథలను మోద మెసఁగఁ
జెప్పె రామాదులకు మునిశ్రేష్ఠుఁడైన
గాధిపుత్త్రుండు మఱునాఁడు గంగ దాఁటి
చనిరి వారు విశాలకు సంతసమున. 60

చ. సురపతిపట్టణంబునకు జోడగు నన్నగరంబుఁ గాంచి యే
నరవరుఁ డేలు నిప్పురము నా కెఱిఁగింపుఁ డటంచు రాముఁ డా
ఖరకరసుప్రభాకరుని గౌశికసంయమిఁ బ్రచ్ఛ సేయ న
న్నరవరపుత్త్రితోడ మునినాయకుఁ డిట్లనెఁ గౌతుకమ్మునన్.

సీ. పుట్టె మీరవికులంబునఁ దొల్లి యిక్ష్వాకు
వసుమహాభాగుండు మనుసమానుఁ
డతని కలంబుస యనుధర్మపత్నియం
దున జనించె విశాలుఁ డనుకుమారుఁ

దతఁడు నిర్మించినకతమున నిప్పురో
త్తమము విశాలాభిధాన మయ్యె
నాతనిసంతతియం దుదయించిన
సుమతినాఁ బరగెడిసుగుణశాలి

గీ. యిప్పురం బేలుచున్నవాఁ డిప్పు డనుచుఁ
జెప్పుచుండంగనే రాజశేఖరుండు
సుమతి యచ్చటి కరుదెంచి యమితభక్తి
మానికులచంద్రమునకు నమస్కరించి. 62

చ. సముచితసన్నుతు ల్సలిపి చయ్యన వారల నాత్మసౌధరా
జమునకుఁదోడి తెచ్చి పరిచర్యలొనర్చి ముదంబుఁగూర్చి సం
యమునకు రామలక్ష్మణుల నర్హవిధంబున గౌరవించె నా
క్రమమున వారు నాఁడట సుఖంబుగనుండి ప్రభాతమందునన్.

ఆ. మరల బయలుదేరి మధ్యాహ్నవేళకు
జనకరాజనగరసవిధదేశ
మందు వెలయునొక్కయాశ్రమమును జేరఁ
జనిరి సంతసమున శ్రమలు వాయ. 64

క. మునిశూన్య మయ్యు సుందర
మును నెంతేనియుఁ బురాణమును సురపూజ్యం
బును నగునివ్వన మెవ్వరి
దని దానిం గాంచి రాముఁ డడిగె మునీంద్రున్. 65

గీ. అంతఁ గౌశికుఁ డత్యంతహర్షమంది
మందహాసంబుఁ గావించి మానుతెల్ల
నాలకించుచునుండ నాయాశ్రమంబు
చిత్రచారిత్ర మిట్లని చెప్పఁదొడఁగె. 66

సీ. వినియుండువేగదా విబుధానుగీతమా
గౌతమబ్రహ్మర్షి కాంతుపేరు
నామునిహార్యక్షునాశ్రమం బియ్యది
చిరకాల మతఁ డిందుఁ జేసెఁ దపము
నతనిభార్య యహల్య యతిరూపవతి పతి
వ్రతలలో నడిసన్న పద్మనేత్ర
యొకనాఁడు గౌతముం డుటజంబునను లేని
సమయమునను బాకశాసనుండు

గీ. గౌతమునివేషమును దాల్చి కపటవృత్తి
నరుగుదెంచి యహల్యతో మరునికేళి
సలిపి సంతుష్టుఁడై పర్ణశాల దాఁటి
పోవుచుండఁగ గౌతమమునివరుండు. 67

గీ. ఎమరుపడి యింద్రుదుర్వృత్తి నెఱిఁగి కోప
మగ్గలింపఁగ విఫలుండ వగుమటంచు
దారుణంబుగ శపియింప ధరణి ద్రెల్లె
నమరనాథునియాండంబుః లంత మునియు. 68

ఉ. లోనికిఁబోయి యెంతయును లోఁగనికన్నులనుండి కోపవై
శ్వానరవిస్ఫులింగములు సాంద్రముగాఁ జదలంట రేగ ను
గ్రాననుఁడై యుగాంతసమయాంతభయంకరవారివాహగ
ర్జానిభకంఠనాదమున జాయఁ గనుంగొని పల్కె నీగతిన్.

ఉ. పమ్మినవేడ్క నత్తులువ వాసవుఁ డంచు నెఱింగియుండి పా
పమ్మొనరించి తీవు భయభక్తులు లేక దురాత్మురాల నా
శమ్మొనరించియుంటివి యశమ్ముఁ గులంబును నాతపోమహ
త్త్వమ్మును నీమొగంబుఁగనవచ్చునె నేనిఁక నెన్నఁడేనియున్.

గీ. ఓసి కామాంధురాల ! నీచేసినట్టి
పనికి నినుఁ జంపినను నాకుఁ బాతకంబు
కలుగ దైనను నినుఁ జంపుతలఁపు లేదు
బుద్ధిచెప్పెద శాపసంబద్ధఁ జేసి. 71

గీ. భస్మశాయినివై యన్నపానములను
వీడి పరితాపభారంబుతోడ నిందె
గాలిఁ గ్రోలుచు నెరికిఁ గానఁబడక
యుండు మతిదీర్ఘకాల మోరండకాన ! 72

గీ. ఎపుడు శ్రీరాముఁ డరుదెంచు నిచటి కప్పు
డతని కాతిథ్య మొనరించి యంతమీఁద
నీవు శుద్ధాత్మురాలవై నెగడఁగలవు
నేను బోవుచునుంటి నీసెలవుఁ బాసి. 73

క. అని చెప్పి యాక్షణంబునఁ
జనియెన్ గౌతముఁడు శీతశైలంబునకున్
ఘనతపము సేయ; నాతని
వనితయు నానాఁటినుండి పడియుండె నిటన్. 74

క. ఈ యాశ్రమమ్ములోనికిఁ
గోయమ్మ సపర్యలను మహానికులకాంతను వే
గమ్మున రక్షింపుము శా
పమ్మును బెడఁబాయఁజేసి పార్థివతనయా ! 75

క. అని కౌశికుండు చెప్పఁగ
విని రాముం డాశ్రమప్రవేశ మొనర్చెన్
మునులు తనవెంట రా నా
క్షణముననే గౌతమర్షి కంజాననయున్. 76

గీ. రాహుముఖముక్త నైనయారాజబింబ
మట్లు పతిశాపముక్తయై యరుగు దెంచి
రామలక్ష్మణులకు మునిరాజులకును
వేడ్క నాతిథ్య మొనరించె వేయిగతుల. 77

సీ. స్వాశ్రమంబును బాసి సహచారిణిని బాసి
శీతనగాగ్రంబుఁ జేరి భూరి
తప మొనరించు గౌతమమునిచంద్రుండు
తనయాశ్రమంబునం దలివిశేష

ముల యోగదృష్టిచేఁ దిలకించి యచ్చటి
కంచితలీలఁ దా నరుగుదెంచి
శాపవిముక్తయౌ శాతోదరినిఁ గాంచి
కౌశికమునివరు గౌరవించి

గీ. తక్కఁగలమౌనివర్యులఁ దగినరీతి
సత్కరించి పదంబుల జాగి మ్రొక్కి
రాజసుతులను దీవించి రమణిఁగూడి
వెలిఁగె రోహిణిఁగూడినవిధునిమాడ్కి. 78

గీ. కౌశికుం డంత రామలక్ష్మణుల నితర
సంయములఁ గూడి గౌతమాశ్రమము వీడి
ప్రాంతమం దున్నమిథిలాపురంబుఁ జేరి
సవనవాటంబునం దొప్పుజనకుఁ గాంచె. 79

గీ. జనకరాజేంద్రుఁడును గడుఁబ్రాంతసమున
గాధినందను మిక్కిలి గౌరవించి
సమయసముచితపూజల సలిపి వినయ
మెసఁగ నంజలిఁ గావించి యిట్టు లనియె. 80

సీ. తాము వేంచేయుట ధన్యుండ నైతిఁ బా
వన మయ్యె మిగుల నాపట్టణంబు
సవన మెంతయుఁ బ్రశంసాపాత్ర మయ్యె నీ
ముఖవాట మొకనూత్నమహిమ నొందెఁ

దమరాకచే నాకు సమకూరె నిమ్మహా
మునుల సందర్శించుపుణ్య మిూక
నర్ఘ్యపాద్యంబు లీయవె కొంకు మన్నింపుఁ
డీసుందరాకారు లెవరిపుత్రు

గీ. లేకతంబునఁ దమ వెంట నేగుదెంచి
రెటుల వర్తింప నాకాజ్ఞ యేమి సేసి
ముదము ఘటియింతుఁ దమకు సమ్మోదమునిూజుఁ
దెలుపఁ బ్రార్థింతు నోమునికులవరేణ్య! 81

క. అన విని కౌశికముని జన
కుని వినయంబునకు మెచ్చికొని దరహాసా
ననుఁ డగుచు నమృతరసషుున
కెన యగువాక్యముల నతని కిట్లని పలికెన్. 82

చ. నరవర! తత్త్వవిద్య సుగుణంబుల ధైర్యపరాక్రమంబులన్
స్థిరమతి నధ్వరంబులను జేయుటయందును దైవభక్తి భూ
సురమునిపూజనంబునను శుభ్రయశమ్మున నిన్నుఁబోలుభూ
వరుఁ డొకఁడైన లేఁడు నినుఁ బ్రస్తుతిసేయఁగ నేల మాటికిన్.

చ. మునులను గూడి నీదుమఖముఁ గనవచ్చితి మేము; వీర లా
యినకులపావనుండు ధరణీశ్వరమౌళియు నైనయాజికిఁ
దనయు లపారబాహుబలధాములు రాముఁడు లక్ష్మణుండునాఁ
దనరెడువారు రాత్రిచరదర్ప మడంచినవీరతల్లజుల్. 84

చ. కలదట మీగృహంబున నొకానొకచాపము దాని నెక్కిడం
గలబలశాలు లిద్ధరణిఁ గానఁగ రారని యాలకించి త
ద్బలముఁ బరీక్ష సేయుటకు వచ్చినవారది చూడఁగాఁ గుతూ
హలపడుచున్నవారు వసుధాధిప! దానిని జూపెదే యనన్,

చ. జనకుఁడు పిన్ననవ్వనగి సంయమిచంద్రుని మోముఁ గాంచియి
ట్లనియె మహానుభావ! తమయానతిచొప్పున దానిఁ జూపి యా
యినకులరాజనందనుల కింపుఘటింతును గాని ముందుగా
వినఁదగు దచ్చరిత్ర మది విస్మయముం గలిగించు నెంతయున్.

సీ. మును విశ్వకర్మ యీధనువును నిర్మించి
పురహరునకు నిచ్చె నరులఁ ద్రుంప
నమ్మహాదేవుఁ డీయద్భుతం బగుచాప
మును దాల్చి త్రిపురనాశన మొనర్చెఁ
బదపడి యాక్రతుధ్వంసి దక్షాధ్వర
ధ్వంసంబు సేసె నీధనువుఁ బూని
యావెన్క ముక్కంటి నర్థించి యమరు లీ
దివ్యచాపంబును దీసికొనిరి

గీ. దేవతల నధ్వరంబులఁ దృప్తిపఱచి
యస్మదన్వయసంభూతుఁ డైనదేవ
రాతుఁ డనురాజు దీనినిఁ గ్రతుఫలముగఁ
గొనియె నానాఁటినుండి మాకులమువారు. 87

గీ. భక్తిఁ బూజించుచుండి రాభవునిధనువు
నట్లె నేనును దినదిన మధికభక్తి
దానిఁ బూజించుచుందు నోమహానివర్య!
యదియె మా కిప్పు డిలువేలు పసఁగనొప్పు. 88

గీ. మఱియుఁ దెల్పెద వేఱొక్కమంజుగాథ
నాలకింపుఁడు మునుపు నే యజనవాంఛ
ధరణి దున్నించుచుండఁగా దొరకె నొక్క
కన్యకామణి వసుమతీగర్భమందు. 89

సీ. అమర నాగటిచాలునందు లభించిన
కతమున నేను నాకన్నె మిన్న
సీతాభిధానను జేసి కన్నకుమారు
విధమునఁ గడుఁ బ్రేమఁ బెంచికొనుచు
నామె యయోనిజ యౌటను నిరుపమ
సౌందర్యసద్గుణజలధి యౌట
నంచితరీతి నక్కాంచనగాత్రిని
వీర్యశుల్కఁగఁ జేయ వేడ్కఁజేసి

గీ. యెవఁడు మాయింటఁ గల్గునయ్యైశుచాప
మెక్కువెట్టఁగ నేర్చు నాయుక్కలునకె
యక్కమలనేత్రి నొసఁగుదు నంచుఁ బ్రతినఁ
బూనియుంటిని కౌశికమునివరేణ్య! 90

సీ. ఆనాఁటినుండియు భూనాథతనయులు
పెక్కురు మాసీతఁ బెండ్లియాడు
కోరిక సనుదెంచి కోదండ మెక్కిడ
లావు లేమి భృశంబు లజ్జపడుచు
మరలిపోయిరి చాలమందికి నామీఁద
వర్ణింపరానికోపంబుఁ గలిగె
నాకోపమునఁ గొంద అతిశూరు లవనిజ
బలిమిమైఁ గొంపోవఁ బట్టువట్టి

గీ. పురము నరికట్టి నాతోడఁ బోరి నిహతు
లైరి కొందఱు భీతిలి పాఱిపోయి
రేమి చెప్పుదు నప్పార్వతీశుచాప
భవ్యచారిత్రి మోమునివర్య! నీకు. 91

గీ. నాఁటనుండియు నవ్వింటిమాట మరలఁ
బ్రశ్న సేయఁ గలుగునట్టిరాకొమరులు
గాన రారైరి వీరి కాకార్ముకంబుఁ
జూచుకోరిక కలదేనిఁ జూపువాఁడ. 92

గీ. మఱియు నీరాజరాజకుమారులందు
నెవ్వ రేనియు నావిల్లు నెక్కువెట్టఁ
గల్గునేడ నిక్కముగ నామకన్నె నొసఁగి
పెండ్లి సేయుదు నెంతయు వేడ్కమీఱ. 93

క. అని నుడివి నృపుఁడు వారికి
ననుకూలం బైనవిడిది నమరిచి తగురీ
తిని గారవించి మఱునటి
దినమున సత్కార్ముకంబుఁ దేఁదగువారిన్. 94

ఆ. అయిదువేలమంది నతిబలవంతులఁ
బనుప వార లేగి పర్వతంబుఁ
బోలునొక్కయినుపభోషాణమును దెచ్చి
యచటఁ బెట్టి రెంతో యలసి సొలసి. 95

గీ. యాగమును జూడవచ్చినయఖిలజనులు
మునులుఁ జూచుచునుండఁగా జనకుఁ డంత
దానిమూఁతను దెఱపించి ధనువుఁ జూపి
రామచంద్రున కిట్లనె రమ్యఫణితి. 96

గీ. ఆసమెయి సీతఁ బెండ్లాడ నరుగుదెంచి
నట్టిరాజకుమారుల కందఱికిని
శృంగభంగ మొనర్చినశివునివిల్లు
చూడు మిదె సూర్యకులవార్ధిసోమ! రామ! 97

క. ఎక్కిడ వచ్చినవీరుల
నిక్కంతయుఁ బాపి వెడలనెట్టి యశంబున్
దక్కించుకొని వెలింగెడి
ముక్కంటిశరాస మిదియె భూరిబలాఢ్యా! 98

క. వీరాలాపము లాడుచుఁ
జేరం జనినట్టిశూరశేఖరుల నమ
స్కార మొనరింపఁజేసిన
గౌరీవల్లభుని ఘోరకార్ముక మిదియే. 99

గీ. బాహుబలమున నీపురవైరిచాప
మెక్కువెట్టంగ నీ వోపెదేని నిన్నుఁ
బెండ్లియాడును మాసీత విపులకీర్తి
కలుగు నీకును నాకు నిక్కంబు ధరణి. 100

క. అన విని రాముఁడు కౌశిక
మునిచంద్రునిపాదములకు మ్రొక్కి గిరీశున్
మనమునఁ దలఁచి దరస్మిత
మొనరించుచు వెల్లివిరియునుల్లాసమునన్.

గీ. ఎట్టివీరాధివీరుల కెక్కువెట్ట
నెత్తఁగఁ దలంపఁగా రానియీశుధనువు
హేల వామకరంబున నెత్తి యెక్కు
వెట్ట నుంకించునంత నాపెద్దవిల్లు. 102

మ. ధరణీచక్రము సంచలింపఁ గులగోత్రవ్రాత మూగాడ సా
గరముల్ ఘూర్ణిల సప్తదిగ్గజములున్ గంపింపఁగా భూనభో
ంతర మొక్కుమ్మడిమాఱుమ్రోయఁగజగత్ప్రాణాశనస్వామిద
ద్దరిల న్భేదిలె రెండుగాఁ బెళపెళధ్వానంబుఁ గావించుచున్,

గీ. కౌశికుండును రామలక్ష్మణులు జనక
జనవరేణ్యుఁడు మఱియుఁ దక్కినసమస్త
జనులు ప్రళయైకనిర్ఘాతసదృశమైన
యమ్మహాధ్వని మూర్ఛిలి యవనిఁబడిరి. 104

గీ. కొంతవడి కెల్లరును దేఱుకొనఁగ జనక
రాజు రాముని భూరిదోర్బలము వొగడి
కౌశికాజ్ఞను గైకొని కౌతుకమునఁ
బంపె నాజికి సీతావివాహలేఖ. 105

గీ. పిదప సాంకాశ్యపుర మేలుప్రియసహోద
రునిఁ గుశధ్వజు విజితవిరోధినిచయు
ననఘు నతిధార్మికునిఁ బంకజాప్తతేజుఁ
బిలువ దూతల నంపి పృథ్వీవరుండు. 106

శా. సీతారాముల పెండ్లివేడుకల నీక్షింపంగ రండంచు నా
శీతక్ష్మాధర సేతుమధ్యమున వాసిం బొల్చుదేశంబులన్
ఖ్యాతిం గాంచినసర్వసజ్జనుల శీఘ్రస్ఫూర్తిఁ బిల్వంగ సం
ప్రీతిన్ బ్రీతుల వేగవంతులను బంపెన్ వేనవేల్ దూతలన్.

సీ. చెల్లునో చెల్లదో చెలఁగి మాజనకధ
రాధినాథుఁ డొనర్చినట్టిప్రతిన
కలుగునో కలుగఁడో కాలకంఠునిశరా
సనము నెక్కిడఁ గల్గుసత్త్వశాలి

జరుగునో జరుగదో సౌందర్యనిధియైన
వసుమతీజాత కుద్వాహమహము
కలదో లేదో మాకుఁ గన్నులపండువు
గా సీత పతిఁగూడఁ గాంచుభాగ్య

గీ. మనుచు నంతవఱకు భయమందుచుండి
నట్టిమిథిలాపురీవాసు లపుడు పొంగి
పౌరలుసంతోషభరమునఁ బుర మలంక
రించి రమరావతీపురి మించునట్లు. 108

గీ. మంత్రిశేఖరుఁ డగుసుధామనుఁడు జనకు
చిత్తవృత్తికిఁ దగురీతి సేకరించె
సకలసంభారముల ధరాజాతపెండ్లి
కపరిమితముగ నెల్లరు నచ్చెరువడ. 109

మ. జనకుం డంతట సర్వనిర్జరమనస్సంతృప్తి సంధిల్లఁగాఁ
దనయజ్ఞంబు సమాప్తమైతగ మహోత్సాహంబుతో నాజిరా
క నిరీక్షించుచుఁ బెండ్లిఁ జూచుటకు వీఁకన్వచ్చునానామహా
జనసంఘంబును సత్కరించుచుఁగడున్ సంతుష్టిమైనుండెఁదాన్.

సీ. మునివెంట నేగినతనయులవృత్తాంత
మాలకింపమి వ్యాకులాత్ముఁడైన
దశరథభూజాని తనచిరమిత్రుఁడౌ
జనకుఁ డంపినలేఖఁ గని మనంబు

కౌతుకసదనంబుగా గాధినందనుఁ
గొనియాడి తనభాగ్యమును దలంచి
యలవిదేహనృపాలుఁ డనఘుండు తనకు వి
య్యంకుఁ డౌనని చాల హర్ష మొంది

గీ. యపుడ యావార్త మంత్రిల కంతిపురికి
నలవసిష్ఠాదిమునులకుఁ దెలియఁజేసి
వారియురరీకృతినిఁ బొంది భూరివైభ
వంబు మెఱయఁగ మిథిలకుఁ బయనమయ్యె. 111

సీ. ఘనులు వసిష్ఠాదిమునులు పురోహితుల్
గ్రిందుగ నగ్రభాగమున వెలయ
వేదశాస్త్రపురాణవిదు లయోధ్యాపురి
విప్రవతంసు లావెనుక నొప్ప
మంత్రిశేఖరులు సుమంత్రాదులును ధనా
ధ్యక్షు లాపిమ్మటఁ దనరుచుండ
బాలభాస్కరసత్ప్రభామూర్తులు భరత
శత్రుఘ్ను లుభయపార్శ్వములఁ గొలువ

గీ. బంధురానంతచతురంగబలముతోడ
వచ్చునాజికి నెదురుగ వచ్చి జనకుఁ
డుచితమర్యాదలను మోద మొదవఁజేసి
విడుదులందున వారిని విడియఁజేసి. 112

గీ. దశరథుండును గాధినందనుని గూడి
జనకపురి నున్న రామలక్ష్మణులఁ గాంచి
చాల హర్షించి కౌశికసంయమీంద్రు
పదములకు మ్రొక్కి మిక్కిలి ప్రస్తుతించె. 113

గీ. జనకునిపురోహితుఁడు గౌతమునిసుతుండు
నౌశతానందమౌనియుఁ గౌశికుండు
నలవసిష్ఠాదిమౌనుల నర్హభంగి
గౌరవించి నుతించిరి కౌతుకమున. 114

గీ. జనకుననుమతిఁ గౌశికమునివరుండు
పిదప నచ్చటివారెల్ల వినుతిసేయ
నాజిదిక్కుమొగంబయి యనియె నిట్టు
లమృతరస మూరుమధురవాక్యములతోడ. 115

సీ. శ్రీరామచంద్రుండు సీత నిలాజాతఁ
బద్మాయతాక్షిఁ జేపట్టుఁగాక
లక్ష్మణుండు లతాంతలలిత రాకాచంద్ర
వదన నూర్మిళను జేపట్టుఁగాక
భరతుండు సాంకాశ్యపతిసుతా కుశధ్వజు
పట్టి మాండవిని జేపట్టుఁగాక
శత్రుఘ్నుఁ డామెకు సహజయౌ శ్రుతకీర్తి
బహురూపవతిని జేపట్టుఁగాక

గీ. యనుడు దశరథుఁ డందుల కనుమతించె;
నట్లయగుఁగాక మేలు మే లనిరి మునులు;
జనకుఁ డంతుల కెంతయు సంతసించె;
నతనితమ్ముఁడు మితిలేనియరుస మందె. 116

ఉ. ఆజినృపాలనందనుల కభ్యుదయంబులు గల్గ లెస్సగా
యోజనసేసి యప్డు సుముహూర్తము లుంచిరి పద్మినీసుహృ
త్తేజులు మౌనిరాజులు విధిజ్ఞు లమోఘవచోవిలాసవి
భ్రాజితసద్యశోవిజితపర్వశశాంకపయఃపయోనిధుల్.

గీ. అపుడు నాందీముఖాదుల నాచరించి
యవనిసురులకు ధేనుసహస్రములను
వత్సములతోడ నలరారువాని దాన
మిచ్చె దశరథుఁ డెల్లరు మెచ్చి పొగడ. 118

క. కృతగోదానకుమారా
వృతుఁ డగునయ్యాజిరాజు విలసిల్లెను ది
క్పతిపరివృతుఁడై యలరెడి
చతురాననుఁడో యనంగ సంతృప్తమతిన్. 119

సీ. వివిధదేశాగతవిప్రవర్యులతోడ
బహుపార్థివోత్తమపరితతితోడ
వైశ్రవణసదృక్షవైశ్యోత్తములతోడ
సత్కీర్తియుతశూద్రజనులతోడఁ

గరిరాజరథతురంగమసంఘములతోడ
నఖిలరాజన్యసైన్యములతోడ
సర్వకళాభిజ్ఞసార్వభౌములతోడ
నటనటీగాయకపటలితోడఁ

గీ. బుడమి యీనినవడువున నెడములేక
యిసుము చల్లిన రాలనియెనక మెసఁగఁ
బూర్ణమైయుండె జనకునిపురవరంబు
పుడమితనయకుఁ బెండ్లి కాఁబోవునపుడు. 120

సీ. అత్తఱి జనకరాజాగ్రణి తనపురో
హితుఁ డైనగౌతమసుతునితోడ
సత్యపరాక్రమశాలి యశశ్శాలి
తమ్ముండు నగుకుశధ్వజునితోడఁ
జతురదాసీపరిష్కృతలై వివాహోచి
తగతి రాజిల్లునందనలతోడ
వేదశాస్త్రపురాణవివిధకళామర్మ
విదులైన యుత్తమద్విజులతోడఁ

గీ. జతురుత్సవకృత్పరిష్కారవార
మణిగణభ్రాజితవివాహమందిరమున
నుండి దశరథభూజాని నుచితలీలఁ
బ్రియసుతులఁ గూడి రమ్మని పిలువనంప. 121

సీ. రవివంశగురుఁడు భారవి వసిష్ఠుఁడు సర్వ
మునిసార్వభౌముండు ముందు నడువఁ
గౌశికకశ్యపకాత్యాయనాదులు
మునిపుండరీకు లావెనుక నడువ
నల సుమంత్రిజయంతు లాదిగాఁగలమంత్రు
లుభయపార్శ్వంబుల నొనరి నడువఁ
గొమరారఁగాఁ బెండ్లికొడుకులు శ్రీరామ
భద్రాదు లావెన్కఁ బరిఢవిల్ల

గీ. విబుధపరివృతుఁ డగుదేవవిభుఁ డనంగ
సద్గ్రహాంతరవర్తియౌ చంద్రుఁ డనఁగఁ
బ్రమథగణమధ్యగతుఁ డగు భర్గుఁ డనఁగ
వచ్చె దశరథుఁడు వివాహభవనమునకు. 122

గీ. అంత జనకుండు వారి కర్హాసనముల
నిచ్చి సత్కార మొనరించి యింపుమిగుల
నలవసిష్ఠునిఁ జూచి యంజలి ఘటించి
వినయపూర్వకముగ నిట్లు విన్నవించె. 123

గీ. ఓమహాభాగ! పెండ్లికి నుచితము లగు
సకలసన్నాహముల శాస్త్రసరణిఁ జేసి
కన్నెల నొసంగుటకు వేచియున్నవాఁడ
నింక సుముహూర్త మీర చేయించవలయు. 124

సీ. నావు డరుంధతీనాథుండు దరహాస
సుందరవదనారవిందుఁ డగుచు
సలశతానందాదు లగుమునిచంద్రులు
సాహాయ్య మొనరింప సంతసమున
విధివిహితంబుగా వేదిని నిర్మించి
కాంచనపాలికాసంచయముల
సంకూరములతోడ నలరుశరావాళి
సుప్రశ్నవంబులఁ గుంభరుచకతతుల

గీ. నతులలాజపాత్రంబుల నర్ఘ్యశంఖ
పాత్రముల నక్షతల ధూపపాత్రములను
జందనంబున వివిధపుష్పముల దానిఁ
బొంకముగ నేర్పుమెఱయ నలంకరించి. 125

గీ. పరగ నావేదియందు దర్భలను బఱచి
యందు నగ్నిఁ బ్రతిష్ఠించి యందుఁ గొన్ని
హోమముల నొనరించె నభ్యుదయ మొదవ
నంత జనకుండు మిక్కిలి సంతసమున. 126

క. తెరవెనుక నున్నసీతను
గరకంజము వట్టి వేదికడ కల్లన సుం
దరగతిఁ గొనివచ్చి మనో
హరవాక్సుధ వెల్లివిరియ ననె సీరతిఁ. 127

సీ. రావోయి మార్తాండపావనాన్వయపయ
స్సాగరరాకాశశాంక ! రామ !
రావోయి దశరథరాజశేఖరపూర్వ
భవకృతబహుతపఃఫలమ ! రామ !
రావోయి భీకరరాక్షసాధ్యక్షవా
రణయూథదళనహర్యక్ష ! రామ !
రావోయి కౌశికరాజర్షి మార్తాండ
సవనసంరక్షణచతుర ! రామ !

గీ. రమ్ము నినుఁ గోరి ధరణిగర్భంబునందుఁ
బుట్టి మాయింటఁ బెరిగినపూవుఁబోఁడి
ఘనమృదులపాణిఁ బాణిఁ గైకొనుము మాకుఁ
గలుగఁజేయుము మితిలేని కౌతుకంబు. 128

క. అని సీతపాణి శ్రీరా
మునిపాణిం బెట్టినంత మోదమ్మునఁ గై
కొనియె నినవంశవరుఁ డా
య్యెన నంతటఁ బుష్పవృష్టి యడరెఁ ఘనమై. 129

గీ. పిదప లక్ష్మణుపృథుపాణిఁ బ్రీతితోడ
నుంచె నూర్మిళమృదుపాణి నంచితగతి
జనకరాట్; జటువెన్కఁ గుశధ్వజుండు
భరతునకుఁ జేత మాండవిపాణి నుంచి. 130

గీ. అట్లె శత్రుఘ్నుపాణియం దాదరమున
నుంచె శ్రుతికీర్తిపాణి; నప్పుడ్వసురులు
మునులు ముత్తైదువలును దీవన లొసంగి
రావధూవరులకుఁ బ్రహృష్టాత్ము లగుచు. 131

గీ. సకలమంగళవాద్యనిస్వనము లఖిల
దిక్కులను బిక్కటిల్లుచు నెక్కొనంగ
నమరదుందుభిశబ్దంబు లాకసమున
నమరెఁ దత్ప్రతినాదంబు లనఁగ నపుడు. 132

గీ. అచ్చరలనాట్యముల మించె నప్పు డచటి
వేశ్యకాంతలనాట్యముల్ వేయిరెట్లు
తద్విలాసంబుఁ గనెడితత్రత్యు లెల్ల
రనిమిషత్వంబుఁ దాల్చి ఔరా యటంచు. 133

చ. జరిగె వివాహము ల్పిదప శాస్త్రహితంబుగ సర్వధారుణీ
సురధరణీశవైశ్యపదజుల్ ముదమంది నుతింపఁగా మునుల్
సురలును నవ్వధూవరులఁ జూచి నరాకృతి నున్నయిందిరా
వరునివివాహము న్గనెడిభాగ్యము గల్గె నటంచుఁ బొంగఁగన్

ఉ. ఎల్లరుఁ దృప్తులౌట మది నెంతయుఁ బొంగె విదేహధారుణీ
వల్లభుఁ డంతఁ గౌశికుఁడు వచ్చినకార్యము లెల్ల హాయిసం
ధిల్లఁగనౌట రాముని నుతించుచు భూరితపం బొనర్పఁగాఁ
జల్లగఁ జేరె సానుగతసన్మునిజాలము శీతశైలమున్. 135

సీ. కలుగునే యిట్టిపెండిలి భూమి నెందైన
నంచు మిక్కిలి సన్నుతించువారు
సీతాతలోదరిచెలువంబు నెన్న శ
క్యమె విరించికినైన ననెడివారు
రామచంద్రునిపరాక్రమరూపసంపద
లతిమానుషంబులం చనెడివారు
భాగ్యమన్న జనకపార్థివోత్తమునిదే
యంచు నెంతయును శ్లాఘించువారు

గీ. నగుచుఁ బెండ్లికి వచ్చినయఖిలజనులు
హర్షభారంబు హెచ్చనో యనఁగ మిగుల
మందగమనంబు లెసఁగ నాత్మపురములకుఁ
బోయి రంతట జనకుండు పుత్త్రికలకు. 136

సీ. ఐరావతముకీర్తి నపహసింపఁగఁజాలు
దానాంచితసితదంతావళముల
నుచ్చైశ్శ్రవముతోడ నుపమింపఁదగుమహా
జవసత్త్వసంయుతసైంధవములఁ
గామధేనువు గేలిగావించుచందానఁ
దనరుసుందరధేనుతల్లజములఁ
జింతామణికి నీడుసేయంగఁదగి యన
ర్ఘము లైనబహువిధరత్నములను

గీ. గనకపల్యంకికాందోలికామనోజ్ఞ
వివిధపాంచాలికారత్నపేటికలను
జిత్రభూషణదాసదాసీజనంబు
సరణముగ నిచ్చె నెల్లరు నౌ ననంగ. 137

ఉ. ఆవల సాధుబుద్ధులు సమంచితమౌగతి బోధసేసి సీ
తావరవర్తినీమణికి ధర్మము తప్పక భర్తయన్నచో
దైవమటం చెఱుంగుమని తద్దయుఁ జెప్పి పతివ్రతావిధుల్
భావము పల్లవించునటులన్ నుడివెన్ మిథిలేశుఁ డొప్పుగన్

సీ. లోకైకవీరులై శ్రీకంఠతనయుని
జోక విరాజిల్లుసుతులతోడ
సాటిలేనిసురూపసౌశీల్యవిభవంపు
టావులై యలరుకోడండ్రతోడ
శారదాభార్గవీచండికాపతులను
బోలువసిష్ఠాదిమునులతోడ
శశిరాక నుప్పొంగుజలనిధివడువున
నలరారుచతురంగబలముతోడ

గీ. సకలమంగళవాద్యఘోషములు సెలఁగ
సమరనాయకవైభవ మమర నిఖిల
జనులు ముదమంద దశరథచక్రవర్తి
బయలుదేరె నయోధ్యకుఁ బ్రమద మెసఁగ. 139

గీ. నయనపర్వంబుగా నిట్లు పయనమైన
దశరథక్షితిపతి కొంతదవ్వు సనిన
యంత నతనికి మార్గమధ్యమునఁ బరశు
రాముఁ డెదురయ్యె లయకాలభీముపగిది. 140

ఉ. ఆతని చేతివైష్ణవశరాసన మల్లన నెక్కువెట్టి వి
ఖ్యాతబలుండు దాశరథి యాతనిగర్వ మడంచెఁ దండ్రికిన్
బ్రీతిఘటిల్ల; భార్గవుఁడు వెక్కస మైనపరాభవాగ్నిచేఁ
జేతము క్రాఁగ నాక్షణమ చేరఁగఁబోయె మహేంద్రశైలమున్

ఉ. అంతటఁ బెండ్లివారు ముదమంది నుతించిరి రామచంద్రువి
క్రాంతి ననంతరంబు నరకాంతుఁడు దా మరలం బ్రయాణమై
సంతసమొప్పఁ గొన్నిదివసంబుల కల్లన నాత్మపట్టణ
ప్రాంతముఁ జేరెఁ బౌరులును బార్థివురాక నెఱింగి యాదృతిన్

చ. పుర మమరావతీపురముపోలిక లీల నలంకరించి చె
చ్చెర నెదురేగి వృద్ధనృపశేఖరుఁ దోడ్కొనివచ్చి యుత్సవం
బు రహి నొనర్చి రెంతయును భూపకుమారులపెండ్లియాత్రమం
దిరముల నైనపెండ్లిగ మదిన్ గణియించు చపూర్వవైఖరిన్.

సీ. సీతోర్మిళాముఖ్యసీమంతినులరూప
సంపత్తిఁ గని నుతుల్ సలుపువారు
జనకుఁ డెంతటిభాగ్యశాలియో శ్రీరాముఁ
డల్లుఁడై విలసిల్లె ననెడివారు

నాజికి వియ్యంకుఁ డయ్యెఁ గుశధ్వజుం
డెంత ధన్యుం డంచు నెంచువారు
నప్రియత్నముగ నిట్లగును వివాహమ్ము
లవని నెచ్చటనైన ననెడివారు

గీ. కడకుఁ గైకేయిసౌందర్యగర్వ మడపఁ
గోరి కాఁబోలుఁ గోడండ్రఁగూర్చె నిట్టి
యలఘుసౌందర్యనిధుల నాయంబుజభవుఁ
డనెడివారైరి పురిఁ గల్గునఖిలజనులు. 144

సీ. చాంచల్య ముడిగి దీపించుమించుందీవె
మించుపోలికఁ బ్రకాశించువారు
సప్రాణకాంచనాంచద్విగ్రహంబుల
నపహసించెడుచెల్వ మమరువారు
నవ్యమాణిక్యసాంద్రప్రభావిభవంబు
నెక్కసక్కియ మాడుహేలవారు
త్రైలోక్యసుందరీదర్పోద్ధతి నడంపఁ
దగురూపసంపత్తిఁ దనరువార

గీ. లఖిలసద్గుణకలశాబ్ధు లయినవార
లైనకోడండ్రవలన నయ్యాజియంతి
పురము కరము వినూతననిరుపమాన
రమ్యమంగళశోభాభరంబుఁ దాల్చె. 145

చ. మనముల మాటలందునను మానుగఁ జేష్టలయందునాజిరా
త్తనయులుఁ దత్సతీమణులుఁ దద్దయు నైక్యముసంఘటిల్లఁగా
ననలును దత్సువాసనలు నా విహరింపఁదొడంగి రాత్మవ
ర్తనములఁగాంచి యెల్లరుఁగరంబుముదంబునసన్నుతింపఁగన్

ఉ. 'రామ'యనంగ భూసుతపరాకున'నో'యనిమాఱువల్కు నా
రామను నట్టె పిల్వ రఘురాముఁడు నట్టులె మాఱువల్కు నా
రామవసుంధరాసుతలరాగబలం బది యెట్టిదో యహి
స్వామికినైనఁ బల్కుచెలిభర్తకునైన వచింప శక్యమే? 147

గీ. ఇట్టియైక్యానుసంధాన మెసక మెసఁగ
నాజిసుతులును దత్సతు లలరుచుండ
సకలసంతోషపరిపూర్తి జరగుచుండె
వాసరంబులు మాసముల్ వత్సరములు. 148

గ ద్య ము

ఇది శ్రీమత్పరదేవతాప్రసాద సమాసాదిత సరసకవితాపరాయణ వేద
వేదాంగవిజ్ఞాన పావనవాజపేయయాజికుల కలశయాదో
నాథతారానాథ రామనాథ వేంకటరమణపౌండరీక
మహాక్రతుయాజికుమార రామసుబ్బారాయ
వేంకటనారాయణకవికిశోర ప్రణీతం
బైన సీ తా క ల్యా ణ ం బను
మహాప్రబంధంబునందు
సర్వంబును
తృతీయాశ్వాసము
సంపూర్ణము.

# ప్రశంస

శా. ఈరీతిన్ విభుతన్ వివాహ మెసఁగన్
వీక్షించితిన్ నాఁడు మా
శ్రీరాజేంద్రున కిందిరాసతికి నా
శ్రీరామకల్యాణను
శ్రీరమ్యస్థితి కుద్దియంచనఁగ ను
ర్వీనాథసంశ్లాఘ్యవి
స్తారామోదము దిక్కులందుఁ బఱగె
న్సంతోష ముప్పొంగఁగన్.

సీ. ఒకవంకఁ బౌరు లింకొకవంక రాజబం
ధువు లొకవంక మంత్రులును దనర
నొకపార్శ్వమున భటు లొకపార్శ్వమున నున్న
తోద్యోగపరివార మొప్పుచుండ
నొకవైపు భూసురు లొకవైపు గాయకుల్
బారులుదీర్చి వైభవము గొలుప
నొకపక్క వేదాంతు లొకపక్కఁ దార్కికు
లొకపక్క సామంతు లోజ నుండ

గీ. నొక్కచోట వేదధ్వని పిక్కటిల్ల
నొక్కపక్క వేశ్యాంగన లుబ్బి పాడ
నొక్కచో మంగళధ్వను లుక్కమీఱ
రాజనగర మెంతేనియు రాణ మిగిలె. 2

ఉ. ఇచ్చిరి భూసురోత్తముల కెంతయుఁ దృప్తినెసంగురీతిగా
నిచ్చిరి సత్కవీశ్వరుల కెంతయుఁ గోరిక దీరునట్లుగా
నిచ్చిరి పండితోత్తముల కెక్కుడుగా బహుమాన మెంతయే
నిచ్చిరి గౌరవోన్నతులు హెచ్చుగవచ్చినవారి కంతటన్.

ఉ. కొల్లపురంబు శోభిలె నకుంఠితతేజముతోడ నారమా
వల్లభమందిరంబనఁగ భాసిలె నప్పుడు రత్నమాంబ రం
జిల్లెడురీతి వైభవము లేర్పడెఁ బెండ్లి మనోహరంబుగా
నెల్లరు మెచ్చునట్లెసఁగె నించుక లోపము లేకయుండఁగన్

గీ. నాఁడు రత్నమాంబికకు నానంద మెసఁగెఁ
బుత్రివైవాహికోత్సవమునకుఁ దల్లి
కుండునానంద మీరీతి నుండు ననుచుఁ
జెప్ప శక్తుండు గాఁ డాదిశేషుఁ డైన. 5

గీ. వంశమును నిల్పు కొమరులు భాగ్యవశము
వలనఁ బుట్టుదు రంచు వైవాహికంబు
జరగుదానికి ఫలముగాఁ బరగు ననుచుఁ
బెద్ద లెల్లరు తఱచు దీవించుచుంద్రు. 6

గీ. కాన మాశ్రీజగన్నాథఘనజనాధి
పునకు నుదయించెదరుగాత ! పుత్త్రిమణులు
రత్నమాంబకుఁ బట్టఁగారానిముదము
కలుగ మాయిందిరాదేవిగర్భశుక్తి.

గీ. నాఁడు కౌసల్య రాముసంతతినిఁ గన్న
లలరురీతిగఁ జూచి వేడ్కలను గాంచి
నట్లు సత్పౌత్రులను రత్నమాంబ చూచి
హర్షమొందెడు భాగ్యంబు నందుఁగాత !



# ఆశీర్వచనపంచరత్నములు



సీ. శ్రీరామపదపద్మసేవాపటుత్వంబు
దైవభూసురభక్తితత్పరతయు
స్వమతాభిలాష సజ్జనపోషణాసక్తి
బీదసాదులఁ బ్రోచు ప్రేమగుణము
గంభీరతరబుద్ధిఁ గాంచుట సతతంబు
గురులన్న నతిభక్తిఁ గొలుచుటయును
దుర్జనసంగతి తొలఁగించుకొను నేర్పు
శూరకార్యములం దపారశక్తిఁ

గీ. గలిగి వినయంబుతోడుతఁ గరుణఁ దాల్చి
శ్రీజగన్నాథరాణ్మణి చెల్వమీఱ
నాయురారోగ్యభోగభాగ్యంబు లంది
చిరతరానందసౌఖ్యంబుఁ జెందుఁగాత! 1

చ. దశరథరామపాలనవిధంబున నిర్మలకీర్తిచంద్రికల్
దశదిశలన్ వెలుంగ వసుధాపరిపాలన మాచరించి నీ
వశమున నే ప్రజాళికి నపారసుఖంబులు గల్గ నన్నమేల్
విశదగుణంబుఁ గాంచు మిఁక విశ్రుతధర్మనిధానమూర్తివై.

ఉ. పూజ్యతఁగాంచుమయ్యతగుభూపతులొప్పఁగనిన్నుఁగొల్వఁ
బ్రాజ్యవిభూతివైభవవిరాజితకీర్తినిఁగాంచుచుండి సా [గాఁ
మ్రాజ్యపదంబు నందు మిఁక మానుషసంపద కిద్దిపేర్మి, మేల్
పూజ్యతఁ గాంచుటే ఫలము భూపతి కిట్టివె ధర్మపద్ధతుల్. 3

చ. ఇలఁగల మానినీనివహ మిందిర యిందిరయేయటంచు,నిన్
బలుమరుఁ గీర్తిసేయఁగ భవద్విభునాజ్ఞఁ దలన్ ధరించుచున్
మెలఁగుట ధర్మమమ్మ యవనిన్ సతికిం బతి దైవమమ్మ,పు
ట్టిలు నిఁక మెట్టినిల్లు గణనీయతఁగాంచ మెలంగు మమ్మరో!

చ. సిరియుమహార్హసంపదయుసిద్ధయశంబునుగాంచిపుత్రులన్
వరగుణవంతులం బడసి భర్తకు నేయెడఁ దోడునీడవై
కర మనురాగ మొప్ప బుధకాండము మెచ్చఁగనొప్పుమమ్మ,శ్రీ
కరమగు వైభవోన్నతులఁ గాంచుమ శ్రీమతి యిందిరాసతీ!

మంగళమ్ మహత్.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



గుంటూరు, చంద్రికా ముద్రాశాలయందు ముద్రింపఁబడియె.